ఆదిశంకరుల

# ఆత్మబోధ





వ్యాఖ్యా

భాగవతి రామమోహనరావు

ఓం

ప్రకాశకులు :

జ్ఞాన వికాస పబ్లికేషన్సు

- , ఆర్. టి., విజయనగర్ కాలని

హైదరాబాదు

ప్రథమ ముద్రణ : 1988, విభవ

ప్రతులు : 1000

సర్వస్వామ్య సంకలితము



మూల్యము : **8- 0**

ప్రతులకు :

జ్ఞాన వికాస్ పబ్లికేషన్సు,
210-3 ఆర్. టి., విజయనగర్ కాలని,
హైదరాబాదు - 28 ఫోను : 37628.

ముద్రణ :

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వర పవర్ ప్రెస్,
హిమాయత్‌నగర్, హైదరాబాదు - 29.

# ఆకాంక్ష

భగవత్ పూజ్యపాదులు, జగద్గురువులు అయిన ఆదిశంకరాచార్యుల వారి పేరు విననివారుండరు. పవిత్రమైన హైందవ సనాతన ధర్మాన్ని ప్రతిష్ఠం చెయ్యడాని , పరమోత్కృష్టమైన అద్వైత సిద్ధాంతాన్ని ప్రబోధించి ప్రచారం చెయ్యడానికీ, అవతరించిన భగవత్ స్వరూపులుగా ఆయనను శవ్యాప్తంగా ఆరాధిస్తారు. ఇప్పటివరకు ఆయనకంటె గొప్ప ప్రతిభ గల వ్యక్తి ప్రపంచంలో ఎక్కడా జన్మించలేద జగద్విఖ్యాతిని ఆయన పొందారు. ఆయన ఎప్పుడు అవతరించారన్న విషయం చరిత్రకారులు వేర్వేరు విధాలుగా నిర్ణయించడం జరిగింది. అయితే వారిలో ఎక్కువ మంది ఆదిశంకరులు ॥శ॥ 8వ శతాబ్దంలో రళరాష్ట్రంలో ఉన్న కాలడి అనే గ్రామంలో నంబూద్రి బ్రాహ్మణ వంశంలో జన్మించారని నిర్ధారణ చేశారు.

అవతార పురుషులవటం వల్ల, శంకరభగవత్పాదులు, బాల్యం నుంచే సమస్త వేదాంత శాస్త్రాలలోనూ అలౌకిక పాండిత్య ప్రతిభలను వ్యక్తం చేస్తూ, బ్రహ్మచర్యాశ్రమం నుంచే సన్యాసాశ్రమాన్ని స్వీకరించారు. వారి జీవిత కర్తవ్యాన్ననుసరించి, వైదికధర్మాన్నీ, అద్వైత సిద్ధాంతాన్నీ ప్రచారం చేస్తూ, సర్వోత్కృష్టమైన అనేక వేదాంత గ్రంథాలను రచించారు. ఆదిశంకరులు వ్రాసిన గ్రంథాలలో ఉజ్జ్వలంగా ప్రకాశమానమయే ప్రతిభను, విశిష్టతను వివరించటం, ముంజేతి కంకణానికి అద్దం పట్టడంలా ఉంటుంది. అసమానమైన ఆధ్యాత్మిక ప్రతిభతో వారి గ్రంథాలు లోకమంతటా, ఎల్లప్పుడూ, అన్ని భాషలలోనూ, జ్ఞాన ప్రభను వెదజల్లుతూ ప్రకాశిస్తూ ఉన్నాయి.

ఆత్మానుభూతిని పొందడమే అన్ని ఆధ్యాత్మిక సాధనలకూ అంతిమ లక్ష్యం. "అహం బ్రహ్మాస్మి", "తత్త్వమసి" లాంటి మహా వాక్యాలు, మనమే భగవత్స్వరూపులమై ఉన్నామన్న మహత్తర తత్త్వాన్ని బోధిస్తున్నాయి. భగవంతుడు, సాధించవలసిన అన్యుడెవరో కాదని, భగవత్ స్వరూపమే మన యదార్థ స్వరూపమై ఉన్నదని, 44వ శ్లోకంలో శంకర భగవత్పాదులు ఎంతో చమత్కారంగా చెబుతారు :

ఆత్మా తు సతతం ప్రాప్తో ప్యప్రాప్తవదవిద్యయా ।
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా ॥ (శ్లో. 44)

అంటే, తాను భగవత్ స్వరూపమే అయి ఉండి, భగవంతుని తెలుసుకో డానికి ప్రయత్నించడం, మెడలో ఉన్న బంగారు గొలుసును, మెడలో ఉన్నట్లు మరచి, దానికోసం, అంతటా వెదకటం వంటిదని.

జీవుడ-వాడుగా భాసిస్తున్న అహంకార భ్రాంతి, మన నిజస్వరూప మైన ఆత్మను ఆటంకపరుస్తూ, అన్ని అనర్థాలకూ మూలమై ఉన్నదని, శంకర భగవత్పాదులు చమత్కారమైన ఉపమానాలతో చెబుతారు. 'శరీరమే నేను' అనుకొనే అహంభావమే వత్వం. దీని 'దేహాత్మబుద్ధి' అంటారు. ఈ 'నేను' అనే భ్రాంతిభావం ఉత్పన్నమవటం వల్ల, మనస్సు, ఇంద్రియాలు, విషయాలు అన్నీ తెలుస్తున్నాయి. అందుకే ఈ అహంకార భావాన్ని 'ద్రష్ట' అంటారు. ఈ ద్రష్ట లేకపో, తెలిసే దృశ్యాలేవీ తెలియవు. ఈ ద్రష్ట, లేదా అహంకారం, వట్టి భ్రాంతేకాని యదార్థమైనది కాదని, ద్రష్టే మిథ్య అయినప్పుడు దృక్కు, దృశ్యాలు కూడా మిథ్యా స్వరూపాలేనని, ఎంతో చమత్కారంగా ఉపమానాలతో శంకర భగవత్పాదులు బోధించారు. ఇలా, భ్రాంతిస్వరూపమై 'నేను' నేనని భాసిస్తున్న, అహంకారం ఎవరని, ఎక్కడ నుంచి ఉద్భవిస్తున్న

దని విచారిస్తే, చివరకు అది లేని ఆయి సాధకుడు తనకు తానే అయి, మిగిలిపోతాడు. తనకుతానై మిగిలేదేదో అది అనుభవైకవేద్యం. అది ఒకరు చెప్పేది కాదు. స్వయం ప్రకాశమై విలసిల్లే సత్చిదానందం. ఈ ఆనందానుభవమే ఆత్మానుభూతి. ఉన్నదంతా ఒక్క ఆత్మస్వరూపమే అయి 'తా, అయి' వేరేదీ గోచరించని ఆ ఆనందానుభూ అపరోక్ష జ్ఞానం. అపరోక్ష జ్ఞానమే అద్వైత సిద్ధాంతం. ఈ జ్ఞానాన్ని 'ఆత్మబోధ' 68 శ్లోకాల్లోనూ ఆదిశంకరులు బోధించారు. ఈ పవిత్ర గ్రంథంలో: ఆత్మ స్వరూపం- అజ్ఞానస్వరూపం- జీవజగత్తుల స్వరూపం- అజ్ఞాన నివృత్తిమార్గం- జ్ఞానంవల్ల కలిగే ఫలాలు- అన్నీ చక్కగా బోధించారు. ఈ శ్లోకాలలో దాగి ఉన్న రహస్యాలను, వివరాలను రచయిత, ఉపనిషత్తులలోనూ, ఆదిశంకరుల ఇతర గ్రంథాలలోనూ ఉన్న అంశాలను జతచేసి, చక్కగా వ్యాఖ్యానించారు కాబట్టి, చదువరులు ఈ శ్లోకాలలోని తత్త్వబోధను గ్రహించి, ఉత్తమమైన ఆధ్యాత్మిక ప్రయోజనాలను పొందగలరని ఆశిస్తున్నాం.

హైదరాబాదు
1-10-1988

ఇట్లు
ప్రకాశకులు

# ప్రార్థన

శ్రుతిస్మృతి పురాణానా

మాలయం కరుణాలయం

నమామి భగవత్పాద

శంకరం లోకశంకరమ్।

యదవిద్యా విలాసేన

భూతభౌతిక సృష్టయః

తం నౌమి పరమాత్మానం

సచ్చిదానంద విగ్రహం॥

ఆది శంకరుల

# ఆత్మబోధ

తపోభిః క్షీణపాపానాం
శాంతానాం వీతరాగిణామ్
ముముక్షూణా మపేక్ష్యో యం
మాత్మబోధో విధీయతే ॥

**తాత్పర్యము :**

తపోనిష్ఠతో యమనియమాదులను పాటించుట వలన పవిత్రులై, హృదయమందు ప్రశాంతత నెలకొనినవారలై, కోరికలను, వ్యామోహములను, వదల్చుకొన్నవారై, ముక్తి కొరకు చిత్తశుద్ధితో సాధన చేయు ముముక్షువుల ఉపయోగార్థమై ఈ ఆత్మబోధ చేయుచున్నాను.

**వివరణ :**

ఎవరి కొరకు ఆత్మబోధ ఉద్దేశింపబడినదో, వారే లక్షణములతో నుందురో ఈ మొదటి శ్లోకమందు చెప్పబడినది. వారు యమనియమము లను పాటించుచు పవిత్రస్వభావులై ఉందురు. యమ మనగా అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అగు సర్వసహన లములను అలవరచుకొనుట. దీనివలన చిత్తశుద్ధి, మనోనిగ్రహము కలుగును. నియమ మనగా, వేదవిహిత వర్తనము, తపస్సు, స్వాధ్యాయము, శౌచము, సంతోషము, ఈశ్వర ప్రణిధానము. కాయిక, వాచిక,

మానసిక తపస్సులని, తపస్సు మూడు విధములు. దేవతలను, సద్ బ్రాహ్మణులను, గురువులను, ప్రాజ్ఞులను పూజించుట, శరీరమును, పరిసరములను పరిశుభ్రముగా నుంచుకొనుట, బ్రహ్మచర్యము నవలంబించుట, ఉపవాసాది సాధనములచే యింద్రియ నిగ్రహము కలిగియుండుట, కాయిక లేక శారీరక తపస్సనబడును. ఏ జీవి ఎట్టి హాని, హింస, మోసము, నష్టము కలుగకుండుట, ఎల్లప్పుడు యదార్థముగను, ప్రియముగను, హితకరముగను సంభాషించుట వాచిక తపస్సనబడును. మనసులో ఎట్టి క్లేశములు లేక, సకల ప్రాణులను ఎల్లప్పుడూ ప్రేమించుచు, విషయ వాంఛలను నిరశించుచు, పరమాత్మను ధ్యానము చేయుటయందే లక్ష్యముంచుట, మానసిక తపస్సనబడును.

యమనియమములను పాటించువారు చిత్తశుద్ధి కలిగి, వాంఛారహితులై ఎల్లప్పుడు ఎట్టి క్లేశములులేక ప్రశాంతచిత్తులై యుందురు. ఇట్టి లక్షణములు కలిగినవారై చిత్తశుద్ధితో, హృదయపూర్వకముగా, ఆత్మానుభూతిని లక్ష్యముగా పెట్టుకొని, సాధన చేయు ముముక్షువుల ఉపయోగము కొరకు ఈ ఆత్మబోధ నిర్దేశింపబడినది. తదితరులగు సామాన్య మానవాళికిది అవగాహన చేసికొనజాలని అనూహ్యమైన విషయము.

ఆత్మబోధ యనగా బ్రహ్మవిద్యాభ్యాసము. బ్రహ్మవిద్యను ఎట్టి వారికి తెలుపవలెనో, ఏ లక్షణములు గలవారు బ్రహ్మవిద్యను తెలిసికొనుటకు అర్హులో ఉపనిషత్తులలోను, ఇతర శ్రుతి స్మృతులలోను విశదీకరింపబడినది. ఈ సందర్భములో ముండకోపనిషత్తు నందుగల ఈ క్రింది శ్లోకము చూడనగును:-

క్రియావంతః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః
స్వయం జుహ్వతి ఏకర్షిం శ్రద్ధయంతః।

తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత
శిరో వ్రతం విధివద్ యైస్తు చీర్ణం ॥

అనగా, సర్వ కర్మలలోను నియమ నిష్ఠలు కలిగినవారు, బ్రహ్మజిజ్ఞాసతో కూడిన ముముక్షత్వము కలిగియున్నవారు, శ్రద్ధాభక్తులతో అగ్నిహోత్రాది కర్మలను చిత్తశుద్ధితో శాస్త్రోక్తముగా ఆచరించుచుండువారు మాత్రమే బ్రహ్మ విద్యకు అర్హులు. అట్టివారికి యీ విద్య నుప దేశించవలెను.

కఠోపనిషత్తునందు కూడ, బ్రహ్మమును పొందవలెనను జిజ్ఞాస కలిగినవాడు, బ్రహ్మతత్త్వమునందు నిస్సంశయమైన నమ్మకముగల వాడై యుండవలెనని, అట్టి నమ్మకము లేనివాడు బ్రహ్మము నెరుగుటకు అర్హుడు కాజాలడని, అట్టి నమ్మకము కలిగిన సాధనావశిష్టుడే బ్రహ్మమును పొందగలడని చెప్ప బడినది.

బోధోన్యా సాధనే భ్యోహి
సాక్షాన్మో క్షైకసాధనమ్
పాకస్య వహ్నివజ్ జ్ఞానం
వినామోక్షో న సిద్ధ్యతి ॥

తాత్పర్యము :

వంట వండుటకు అగ్ని ఎట్లు మూలకారణ మగుచున్నదో, అట్లే ఆత్మజ్ఞాన ప్రాప్తియే ముక్తినొందుటకు కారణ మగుచున్నది. ఆత్మజ్ఞానము పొందని , ఏ ఇతర సాధనా కార్యకలాపములవల్లను మోక్షము పొందుట అసంభవము.

**వివరణ :**

అజ్ఞానమును తొలగించుకొను సాధనయే నిజమైన ఆధ్యాత్మిక సాధన కాగలదు. సూర్యు డుదయించిన తోడ చీకటి తొలగిపోవునట్లు, జ్ఞానోదయమైన వెంటః అజ్ఞానము సర్వమూ పటాపంచ లగును.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్య ।
తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి ॥
(భగవద్గీత అ॥ 4 శ్లో॥ 38)

అనగా జ్ఞానముకంటె పవి త్రమైన దియునులేదు. ఆత్మజ్ఞానమును అనుభవ పూర్వకముగా పొందుటయే అన్ని యోగసాధనల యొక్క పరమ లక్ష్యమై యున్నది. లక్షింపవలసినది మన నిజస్వరూపమగు బ్రహ్మానుభవము. బ్రహ్మస్వరూపమే మన యదార్థ స్వరూపమై యున్నది. హమే మన స్వరూపమను మిథ్యాభావము పూర్తిగా వదలి, బ్రహ్మస్వరూపభావ ముదయింప యునది జ్ఞానమేకాని వేరు కర్మకలాపము లేవీ కావని శాస్త్ర విదితమై యున్నది.

పఠంతు శాస్త్రాణి యజం తు వాన్
కుర్వంతు కరా ణి భజంతు వతాః
ఆత్మైక్యబో న వినా విముక్తి
ర్నసిద్ధ్యతి బ్రహ్మ శతాంతరేపి ॥ (వివేకచూడామణి)

అనగా, ఎన్ని శాస్త్రములను జదివినను, యజ్ఞయాగాదు లెన్ని చేసినను, ఎంత మంది దేవతలను భజించినను, ఆత్మానుభూతి కలుగదు. ఇట్టి కార్య కలాపములు వందల కొలది సంవత్సరము లాచరించినను, ఆత్మజ్ఞానము కలుగని, ముక్తి సిద్ధింపదు.

"జ్ఞానా వతు కైవల్యం", "జ్ఞానా వ
మోక్షశ్చ, ఏతావదరే ఖల్వమృతత్వమ్"

అను శ్రుతులు ఆత్మజ్ఞానము వలన స్వస్వరూపమగు బ్రహ్మత్వము సిద్ధించునని బోధించుచున్నవి. కావున, మోక్షసాధనము జ్ఞానమేనని శాస్త్రములు నిర్ధారణ - సినవి.

జ్ఞానమనగా ఆత్మానాత వివేకము. అ నిత్యానిత్య వస్తు వివేకము. అనగా, గోచరించెడి జడసముదాయములగు లోకము, శరీరము, పం ం దియ కూటము, అంతఃకరణ చతుష్టయమగు మనః, స్చిత్త, బుధ్యాహంకారములు సర్వమూ, మిధ్యాజన్యములును, ఆరోపితములు, అనిత్యములుగాని, అవి యదార్థములు గావని నిశ్చయించుకొని, తదుపరి లోపల, వెలుపల, అంతటనూ నిండియుండి, సర్వావస్థలను పకాశింప యు చైతన్య స్వరూపమగు బహ్మమును - అని అనుభూతి చెందుటయే జ్ఞానము. జ్ఞానస్వరూపమే దైవస్వరూపము. జ్ఞానమూ దైవము ఆ విధముగా ఒకటియే.

అవిరోధితయా ర్మ
నావిదా ం నివర్తయేత్
విదా విదా ం నిహన్తే వ
తేజస్తిమిరసంఘవత్

తాత్పర్యము :

కర్మ అజ్ఞానమును నాశనము చేయజాలదు. ఏల యన అది అజ్ఞానమునకు విరుద్ధమైనది గాని విరోధమైనది

గాని కాదు. వెలుగెట్లు కారుచీకటిని నశింపజేయునో అట్లే జ్ఞానమే అ నమును నశింపజేయగలదు.

**వివరణ :**

భగవత్తత్వ మెట్టిదో తెలిసికొనుటయే ానము. భగవత్తత్వము నెఱుగని అ ానపు స్థితిలో - యు ప్రార్థనలు, పూజలు మొదలగు కార్య కలాపములు, అర్థహీనములై నిష్ప్రయోజనములే యగుచున్నవి. ఎన్ని వాలయములను దర్శించినను, తీర్థయా తలు చేసినను, పూజలు, జపములు, భజనలు, దానములు, యజ్ఞయాగములు, ఎంతకాలము ఎన్నెన్ని చేసినను అజ్ఞానమును తొలగించుకొనుట అసంభవమగు చున్నది. ఎన్ని కర లు - నను, అజ్ఞానము నశించి జ్ఞానముదయించదు. ఏలయన, కర్మము లన్నియు, - దియ కర్మేం దియములకు, మనస్సునకు సంబంధించినవి. అవన్నీ అజ్ఞానమువలన ఉత్పన్నమైన విషయములు. బహ్మము ఇం దియములకు మనస్సునకు అందనిది. విషయా తమైనది.

కర్మలన్నీ అజ్ఞానజనితములే. ఇం దియ పేరితములే. అవి అజ్ఞానమునకు విరుద్ధమైనవీ విరోధమైనవీ గావు. అజ్ఞా ము వల్ల, మనస్సుద్భవించుచున్నది. సంకల్ప వికల్పాత్మకమగు మనస్సు వలన సర్వకర కలాపములు జరుగుచున్నవి.

నమే అజ్ఞానమును నశింప సి అజ్ఞాన జనితములగు సర్వభయ బంధములనుండి విడిపించును.

"కురు గంగాసాగర గమనం
వత పరిపాలన మధవా దానం
ాన విహీన స్సర్వ మ న
ముక్తిం నభజతి జన శ న"

అనునది ఆ॥శంకరుల మోహముద్గరలో కాననగును. అనగా, జ్ఞానము పొందనిదే, గంగానదులయందుగాని, సము ద్రములలోగాని ఎన్ని స్నానములు చేసినను, వ్రతములు, దానములు ఎన్నెన్ని సినను నూరు జన్మలకైనను, ఏ మతము చేతను ము క్తిని పొందుట దుర్లభము.

నిరాకార నిర్వికార, అనంతమయమగు ఆత్మస్వరూపమే ఎల్లప్పుడూ మానవుని నిజస్వరూపము. దానిని ఆవరించుకొనియున్న అజ్ఞానమును తుడిచివేసిన ఎప్పుడూ స్వతఃసిద్ధముగా నున్న ఆత ప్రకాశము ప్రకటితమై అనుభూతి యగును. అ ానమును తుడిచివేయునది ఆత జ్ఞానమే. మరేదియు దానిని నశింపజేయలేదు.

ఛిన్న ఇవాజ్ఞానాత్
తన్నాశే సతి కేవలః ।
స్వయం ప్రకాశ తేహ్యాత్మా
మేఘాపాయేం శుమానివ ॥

తాత్పర్యము :

అజ్ఞానము వల్ల ఆత్మ (మన నిజస్వరూపము) పరిమితత్వపు ఉనికి కలిగినట్లు గోచరించుచున్నది. అజ్ఞానము నశించినంతనే, మేఘపుదడ్డు తొలగిన సూర్యునివలె, ఆత తనకుతానై ద్వందా త అపరిమిత అనంతస్వరూపుడై విలసిల్లును.

**వివరణ :**

అనంతము, ఆద్యంతరహితము, ఆకారశూన్యము నగు ఆత్మకు, అజ్ఞానమువలన పరిమితత్వ మెట్లు కలిగెనో గుర్తించవలసి యున్నది. అజ్ఞానము సూక్ష్మశరీర ముత్పన్నమగుటకు, అహంకార భావముదయించుటకు, మూలకారణమైన దగుటచే, దీనిని కారణ శరీర మందురు. ఇదియే అనిర్వచనీయమగు మాయ క ప్రకృతిశక్తి. సర్వచరాచర ప్రపంచమునకు కారణభూతమైనది. మాయ, అవిద్య, అజ్ఞానము ఒకటే. దీనిని సత్వ, రజ, స్తమో గుణములను మూడు తలలు గల సర్పముగా వర్ణింతురు. త్రిగుణాత్మకమైన ఈ అజ్ఞానము, ఆత్మ స్వరూపమునకు మూలావరోధమై, ఆవరణ విక్షేప శక్తులను కల్పించి, ఆత్మ స్వరూపమును మరుగు చేయుచుండును. ఆవరణశక్తి వలన, సర్వత్రా వ్యాపించియున్న సత్యవస్తువగు ఆత్మ తెలియదనుకొనెడి, లేదనుకొనెడి, ప్రవృత్తి కలుగును. ఇంద్రియ గోచరములగు శరీర ప్రపంచాదులే నిత్యమైనవని, దేహమే ఆత్మస్వరూప మనుకొను అసత్య ప్రవృత్తి తోచును. సకల కర్మలకు మూలమైన దేహమే "నేను" అనుకొనెడి దేహాభిమానము లేక దేహాత్మబుద్ధి, ఆవరణ విక్షేప శక్తుల వలన ఉత్పన్నమగును. ఆత్మ కంటె అన్యమగు దృష్టిని కలిగించుటయే ఆవరణ విక్షేప శక్తుల కార్యము. ఈ అన్యదృష్టి వలననే, రక్తమాంస భూయిష్ఠమగు దేహమే "నేను" అనుకొనెడి అహంకారము దయించి. నామ రూపములు లేని అపరిమితమగు చైతన్య స్వరూపమైన ఆత్మ ఒక పరిమితత్వపు ప్రత్యేక ఉనికిగల "తాను"గా అపోహపడి భ్రమించుచుండుట జరుగుచున్నది. అహంకారమునకు అజ్ఞానమే సృష్టికర్త. అజ్ఞానము పోగొట్టుకొనిన, దానితోపాటు అహంకారము, సూక్ష్మశరీర కూటమియగు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు, పంచభూతములు, వాయుపంచకము, అంతఃకరణ చతుష్టయము సర్వమూ ప్రపంచలగును ఇవన్నియూ ఆత్మకు అవరోధములు. సూర్యుని జస్సున

కడ్డముగా నుండి దానిని మరుగు చేయుచున్న మేఘములవంటివని, జగద్గురువులు ఉదహరించినారు. అజ్ఞాన జనితములగు అవరోధములన్నీ తొలగిపోయిన వెంట- ఎల్లప్పుడూ స్వయం పకాశమానమగు ఆత తనకు తానై, మేఘములు వదలిన సూర్యునివలె, ద్వంద్వా •త, అపరిమిత, అనంత స్వరూపముతో వెలయుచుండును.

## 5

అజ్ఞాన కలుషం జీవం
జ్ఞానాభా సాద్ వినిర్మలం
కృత్వా జ్ఞానం స్వయం
న ృజ్జలం త ణువత్ ॥

**తాత్ప ర ము :**

ఇండుపుకాయ గంధము లేకపొడి మట్టి నీళ్ళను పరిశు భ పరచి తాను అదృశ మగును. అట్లే జ్ఞానము, నిరంతర సాధనవలన, హాత బుద్ధి కలిగినదై అజ్ఞానపు మాలిన్యముతోనున్న వుని పవి తము గావించి, తానును మాయ మ పుచున్నది.

**వివర ణ :**

వుడు అజ్ఞానపు మాలిన్యముతో నుండుటకు కారణమేమో పరిశీలించవలసి యున్నది. మనకు రెండు విధములైన జ్ఞానములున్నవని ముందు తెలిసికొనవలెను మొదటిది అజ్ఞానమువలన భాసించెడి జ్ఞానము. దీని. మిధ్యాజ్ఞానమని కూడ అందురు. నేను, నాది, ను చేయుచున్నాను,

నేను చదువుచున్నాను, ఈ శరీరము నాది, ఈ ఆస్తులు నావి అనుకొనెడి, అహంకార మమకార కర్తృత్వ భావమేదై మానవులలో సర్వ సామాన్యముగా భాసించుచుండునో, అదియే మిథ్యాజ్ఞానము. ఈ మిథ్యాజ్ఞానము కలుగుటకు అజ్ఞానము లేక అవిద్య కారణమైయున్నది. దీని ప్రకృతి వికారమగు విజ్ఞానకోశమని అందురు. దీనివల్ల అద్వయమగు పరమాత్మ యందు జీవత్వము కల్పింపబడి, మిథ్యా స్వరూపమగు దృశ్య ప్రపంచము గోచరించుచూ సర్వ సంసార సుఖ దుఃఖములను అనుభవించుచుండుట జరుగుచున్నది. జీవునకు అజ్ఞానమువలన కలిగిన దేహాత్మబుద్ధి, అనగా నేనే దేహమును అనుకొనెడి భావము అనాదియై ఒక పెద్ద విషవృక్షముగా పెరిగి యున్నది. "నేను" అను దేహాభిమానము వలన రజస్తమో గుణములచే నావరింపబడిన జీవుడు ఉపాధి దోషములచే సుఖదుఃఖములు, రాగద్వేషములు, క్షుత్పిపాసలు, రోగములు, ముసలితనము, మరణము మొదలగు సకల సంసారపు సుడులయందు చిక్కుకొనుచున్నాడు. ఇదియే జీవునికి కలిగిన అజ్ఞానపు మాలిన్యము. ఈ అజ్ఞానపు మాలిన్యమును జ్ఞానమే పోగొట్టకలదు గాని మరి దేనివలననూ సాధ్యముకాదని ముందు శ్లోకములలో వివరించబడినది.

యదార్థముగా జీవుడు, నామ రూపములులేని చిదానంద స్వరూపుడై వెలయుచున్నాడు. అజ్ఞానము వలన దేహేంద్రియాదులే తన యదార్థ స్వరూపమని, జాగ్రత్, స్వప్న, సుషుప్తవస్థలు కలిగిన జీవితమను భ్రాంతిలో దగుల్కొని, అనేక కష్టసుఖముల ననుభవించుచున్నట్లు భ్రమించుచుండుట జరుగుచున్నది.

మనకు రెండు విధములైన జ్ఞానములున్నవని, అందు మొదటిది అజ్ఞానమువలన భాసించెడి మిథ్యాజ్ఞానమని గమనించినాము. ఇక రెండవది తత్వమస్యాది మహావాక్యములు బోధించెడి " బ్రహ్మస్వరూప

డనై యున్నాను" 'అహం బ్రహ్మాస్మి' యనెడి ఆత్మజ్ఞానము. ఇదియే ప్రజ్ఞానము. ఈ జ్ఞానము వలన , దేనివలననూ సాధ్యముకాని అజ్ఞానపు మాలిన్యము తొలగిపోగలదు. ఈ జ్ఞానమునకు ముఖ్యాంశము ఆత్మానాత్మ వి కము. అనగా, గోచరించెడి జడ సముదాయములగు లోకము, శరీరము, పం ం ద్రియ కూటము, అంతఃకరణ చతుష్టయమగు మనస్చిత్త, బుధ్యా హంకారములు సర్వమూ, మిధ్యాజన్యములును, ఆరోపితములు, అనిత్యములుగాని, అవి యదార్థములు గావని నిశ్చయించుకొని, తదుపరి లోపల, వెలుపల, అంతటను నిండియుండి, సర్వావస్థలను ప్రకాశింపజేయు చైతన్య స్వరూపమగు బ్రహ్మమును నేనే అని అనుభూతి చెందుటయే జ్ఞానము. అట్టి ఆత్మజ్ఞానముదయించినంత దేహాత్మ బుద్ధి నశించును. అన్ని అనాత్మ ప్రవృత్తులు తనకు కలిగిన భ్రాంతులేకాని యదార్థములు గావని, కేవలము స్వప్న సమానములని విదితమగును.

మిధ్యా స్వరూపములైన పంచభూతములు, శరీరము, మనస్సు, ఇం ద్రియములు, అంతఃకరణ చతుష్టయము మున్నగు ప్రకృతి వికారములన్నియు కల్పితములగు తన యొక్క భ్రాంతులు మాత్రమేకాని యధార్థములుగావని తెలిసిపోవుటతో అవన్నియూ ఆత్మస్వరూపుడగు తనలో లయించిపోవును. ఇట్టి తెలివియే ఆత్మజ్ఞానము. ఈ తెలివిలో సర్వకాల సర్వావస్థల యందు స్థిరత్వము సాధించుటయే జ్ఞానసిద్ధిని బొందుట. సమ్యక్ జ్ఞానమనబడు ఈ తెలివిని సాధించుటకు నిరంతర దృఢాభ్యాసము అత్యావసరము. తీవ్రతరమైన సాధన చేయని , ఆధ్యాత్మిక ప్రగతి సిద్ధింపదు. తెలివితో, పట్టుదలతో ఎట్టి ఆటంకములకు లొంగక, సంతతము సావధాన చిత్తముతో ధ్యాన నిమగ్నుడై సాధన చేయవలసి యున్నది.

## 6

సంసారః స్వప్న తుల్యో హి
రాగద్వేషాది సజ్కులః
స్వకాలే సత్యవద్భాతి
ప్రబోధే సత్యవద్భవేత్ ॥

**తాత్పర్యము :**

రాగద్వేషాదులు, సుఖదుఃఖములు, మున్నగువానితో నిండియున్న ప్రపంచము ఒక స్వప్నము వంటిది. ఎంత కాలము మానవుడు అజ్ఞానముతో నుండునో అంతకాలము ప్రపంచము యదార్థమైనదిగా గోచరించుచుండును. కాని జ్ఞానోదయమైన వెంట అసత్యమైనదై స్వప్నమువలె మిధ్యయై అదృశ్యమగును.

**వివరణ :**

మనకు జాగ్రదవస్థయందు గోచరించుచున్నవి దేహము, లోకము. ని దానంతరము బడలు విరుచుకొనుచు మెలకువ తెచ్చుకొని లేచుచున్నాము. ఈ మెలకువయే జాగ్రదవస్థ యనబడుచున్నది. జాగ్రదవస్థ ఒక కృత్రిమ తెలివియై, భ్రాంతి (anima ion) కి, అసత్యమైన ప్రపంచ దృష్టికి కారణమగుచున్నది. ఈ మెలకువను, తెలివిని, నిజమైన మెలకువ, తెలివిగా భావించుట పొరపాటను విషయము జ్ఞానముదయించిన తెలియును. ఏల యన, ఈ తెలివివలన జాగ్రదవస్థలో, శరీరమే " ను" అనుకొను కృత్రిమ అసత్యపు అహంభావ ముదయించి, భ్రాంతిలో తగుల్కొనునట్లు చేయును. హమే . ననుకొను భ్రాంతి భావముతో, శబ్ద, స్పర్శ, రూప

రస, గంధములగు పం౦ ం దియముల ఉనికిని గహించుట, పపంచమను మాయకలాపము గోచరించుట జరుగుచున్నవి. జా గదవస్థలో కలిగిన తెలివి, గోచరించు జగత్తు కృ తిమమై, స్వప్న సమానమైనవని జ్ఞానము దయించి నంత విదితమగుచున్నది. స్వప్నసమయములో తనకు కలిగిన శరీరము పట్టి కల్పన అనీ, భమ అని జా గతలోనికి రాగా ఎట్లు తెలిసిపోవుచున్నదో, అట్లే జాగ్రత కూడ భమేనని, జ్ఞానముదయించిన తోడ తెలియగలదు.

జా గదవస్థలో గోచరించెడి దృశ పపంచముకూడ స్వప్న పపంచము వంటిదే. కాని అజ్ఞానముతో నున్నంతకాలము దానిని యదార్థమైనదిగా భావించుచు, రాగ ద్వేషాదులు గలిగి, సుఖదుఃఖములతో వుడు జీవయా త -యును. ఈ పరిమితత్వపు వ భాంతి, రాగ ద్వేషాదుల అసత్యపు అనుభవములు, సుఖదుఃఖములు, మున్నగు సర్వ ద్వంద్వభావములు జ్ఞానోదయమైన వెంట పటాపంచలగును. జ్ఞానము వీటి నన్నిటిని, స్వప్నతుల్యమైనవిగను, మిధ్యయైనవిగను విదితము - యును. "బహ్మ సత్యం జగన్మిధ్య", అనగా పపంచము అసత్యమై, స్వప్నమువలె కల్పితమైనదేనని, ఉన్నది ఆత్మస్వరూపమైన బహ్మ మొక్కటేనని విశదపరచి, జ్ఞానము పపంచ యధార్థత్వమును వ్యక్తపరచును. పంచభూతాది ఆ త్మేతర వస్తువులను నిషేధింపగా, ఏ పూర్ణాత్మయగు సచ్చిదానందము మిగులునో, అదియే తానని యెరుగుటయే జ్ఞానమై యున్నది. అట్టి జ్ఞానికి తనకంటె నన్యము పాప్యము అగు ద్వి -య వస్తువు గోచరించదు. ద్వి యమంతయు స్వప్నమువలె అసత్యమైనవని తెలిసిపోయినది.

తావత్ సత్యం జగద్భాతి
శుక్తికారజతం యథా
యావన్నజ్ఞాయతే బ్రహ్మ
సర్వాధిష్ఠాన మద్వయమ్ ॥

తాత్పర్యము :

సర్వాధారమైన అద్వితీయ పరబ్రహ్మము ఎంత కాలము తెలియకుండునో అంతకాలము ఈ ప్రపంచము నిజముగా ఉన్నట్లు గోచరించుచుండును. ముత్యపు చిప్పను జూచి వెండియనుకొను భ్రాంతివలె అసత్యమైన ఈ ప్రపంచము సత్యమైనదిగా గోచరించును.

వివరణ :

నిజముగా లేని ప్రపంచము ఉన్నట్లు గోచరించుచుండుటయే అజ్ఞానము. దీని అనిర్వచనీయమగు ప్రకృతి శక్తియని, మాయయని కూడ అందురు. అజ్ఞానమువలన భాసించెడిది మిథ్యాజ్ఞానమని ఇంతకుముందు గమనించితిమి. దీని అవిద్యయని కూడ పేరు కలదు. "నేను, నాది, నేను చేయుచున్నాను." అనుకొనెడి అహంకార మమకార కర్తృత్వ భావమేదైతే మానవులలో సర్వసామాన్యముగా భాసించుచుండునో, అదియే మిథ్యాజ్ఞానము. ఎంతకాలమీ మిథ్యాజ్ఞాన ముండునో అంతకాలము ప్రపంచము నిజముగా ఉన్నట్లు గోచరించుచుండును. ఇదియే ప్రకృతి వికారమగు విజ్ఞానమయ కోశమనబడుచున్నది. పురుషుడను పరిమితత్వ నామరూపాకార స్వరూపుడుగా భ్రమించుచు సర్వసంసార సుఖదుఃఖములను అనుభ

వించుచుండుట దీనివలన జరుగుచున్నది. ఆత్మాపరోక్షానుభూతి కలుగుటకు ఈ మిథ్యాజ్ఞానమును పోగొట్టుకొనుటయే సాధనమై యున్నది.

నిరంతరము ఆతానాత్మ వస్తు విచారమువలన, ఆత్మజ్ఞానమగు సమ్యక్ జ్ఞానము సిద్ధించును. అపుడు దేహాది దృశ్య ప్రపంచము యొక్క అసత్యత్వము వ్యక్తమై, శరీరము, ఇంద్రియములు, మనస్సు, బాహ్య ప్రపంచము, కర్తృత్వ భోక్తృత్వములు, సమస్తములు, తనకు కలిగిన భ్రాంతులేగాని, యదార్థముగా ఇవి ఏమియు లేనివని సాధకునకు కరతలామలకముగా అనుభవమునకు వచ్చును.

క్షరాక్షర వ్యక్తావ్యక్తాల సంయోగము సృష్టింపబడిన యావత్ ప్రపంచాని కారకుడు భగవంతు నని, భగవత్తత్వము తెలిసికోనంత కాలము, మానవులు విషయవాంఛలకు లోనై ఇంద్రియ ప్రేరణలకు బద్ధులై ప్రపంచమే నిజమని వృలుగా బతుకుచుందురని, ధ్యానాది సాధనల ద్వారా భగవంతుని సాక్షాత్కరింప సికొన్న వారికి సర్వ అ న జనిత భ్రాంతి భావములు వదలి బహ్మానందానుభూతి కలుగునని, శ్వేతాశ్వతరోపనిషత్తునందు స్పష్టముగ ప్రతిపాదింపబడినది.

ప్రపంచము మిథ్యాస్వరూపము. స్వప్నతుల్యము. ఆత్మయందు ఆరోపింపబడిన భ్రాంతి భావము. ఈఆరోపణకు మూలకారణ మజ్ఞానము. ముత్యపుచిప్పను జూచి రజితము (వెండి) యను అసత్యపు భ్రాంతి భావమువలె, ఆత్మయందు అజ్ఞానము వలన, ప్రపంచారోపము కలిగినది. యదార్థమగు నొక వస్తువును చూచి, యదార్థము కాని మరియొక వస్తువుగా భ్రమపడుచుండుట, అధ్యారోప మనబడును. ఎంతకాల మీ భ్రాంతి భావము లేక అధ్యారోపముండునో, అంతకాలము యధార్థ స్వరూపమగు ఆత్మ మరుగై, అసత్యమైన శరీరేంద్రియ ప్రపంచాదులు, యధార్థమైనవిగా గోచరించుచుండును. నాకరహితుడు, అనంతుడు, ఏకమాత్రుడు నైన భగవంతుని

నిరంతర ధ్యానము వలన, అన్ని ఆ భాసలు, అధ్యారోపములు అంతమై, సర్వాంతర్యామియైన ఆ బ్రహ్మస్వరూపు డొక్క ప్రకాశించుచుండును.

సచ్చిదాత్మన నుస్యూతే
నితే విష్ణౌ వికల్పితా
వ్యక్తయో వివిధాః సర్వా
హాటకే కటకాదివత్ ॥

**తాత్పర్యము :**

అన్ని వివిధ రూపములు భ్రాంతివలన ఉన్నట్లు గోచరించుచున్నవి. గాని నిజముగా ఉన్నవాడు సర్వాంతర్యామియై ఎల్లెడల అంతటనూ నిండియుండు సత్‌చిత్ స్వభావుడగు విష్ణువే బంగారముతో తయారైన గాజులు, కడియములు మున్నగునవి నామరూపములు గలవి కాగా బంగారము వాటికి కారణభూతమైనట్లు, ఈ గోచరించెడి సమస్తనామ రూప ప్రపంచమునకు విష్ణువు ఆధారభూతుడు.

**వివరణ :**

ఉన్నది భగవంతుడొక్క . రెండవది లేదు. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అని శ్రుతి బోధించుచున్నది. ప్రపంచమంతయు భగవంతుని నుండి ఉద్భవించినది. అందుగల సమస్తము భగవత్ స్వరూపమే యగునుగాని అంతకంటె వేరుగా ఐదు. బంగారమునుండి గాజులు, కడియములు, ఉంగరములు, గొలుసులు మున్నగు పలువిధ ఆభరణములు

వివిధ నామరూపములతో చేయబడుచున్నవి. స్వరూపము త అవన్నియూ బంగారమేగాని వేరు కాదు. అజ్ఞానము వలన ఆ వస్తువులయందు భేద బుద్ధి కలిగి, వాటిని వివిధ నామములచే పిలుచుచున్నారు. బంగారము కంటె గాజులు, కడియము ఉంగరము, గొలుసు వేరు కాదుగదా! ఆ వస్తువులు చేయకమునుపు అవి బంగారము. ఆ వస్తువులను తిరిగి కరిగించిన పిమ్మటను అవి బంగారమే. ఇక మధ్యకాలములో, అనగా వాటి ఆభరణ రూపములలో మాత్రము అవి బంగారము కాక ఏమగును ? ఇట్లే అనేక ఉపమానములు వేదాంత శాస్త్రములందు గానవగును కుండలు, మూకుళ్లు, పమిదెలు మున్నగు వస్తువులు మట్టితో చేయబడి, వేరువేరు నామములతో పలుకబడుచున్నవి. అవన్నియు ఎప్పుడును మట్టియేకాని మట్టికంటె వేరు కాదు. కాని. అవి మట్టికంటె వేరు కాకున్నను, మట్టితో యబడు వాని ఆకారముల వలన వివిధ నామములతో పిలువబడుచు వివిధ రూపములతో వ్యవహరింపబడుచున్నవి. దీని వాచారంభణమని యందురు. అనగా మాటలలో భేదము గాని మట్టిలో దమేమియు లేదు. బంగారము నుండి ఉత్పత్తియైన గాజులు, గొలుసులు, ఉంగరములు మున్నగు వస్తువులు వాచారంభణమై అవి కరిగించిన వెంటనే బంగారమే యగుచున్నవి.

బంగారముతో తయారు కాబడిన సమస్త వస్తువులకు బంగారమే కారణము. వస్తువులు కార్యములు. అట్లే మట్టితో తయారైన కుండ, మూకుడు, పమిద. మున్నగు సకల వస్తువుల ఉత్పత్తికి మట్టియే కారణము. ఆ వస్తువులు మట్టియొక్క కార్యములు. ఏది ని కార్యమో అది దానికంటె భిన్నముగాదని యదార్థముగా తెలియుచున్నది.

సర్వాంతరా మియైన ఏక స్వరూపుడగు భగవంతుని యందు నామ రూపాత్మకముగు పపంచము ఉద్భవించినది ఈ జగత్సృష్టి, తన

సృష్టికి పూర్వము లేనిదై, కొంతకాలముండి, భగవంతుని యందు తిరిగి లయించుచున్నది. ఆద్యంతములలో లేనిదై మధ్యకాలమందు, అనగా సృష్టి కాలమందు స్వప్నతుల్యమై భాసించు సమస్త నామరూప ప్రపంచము భగవంతునికంటె అన్యము కాదని, పైన చెప్పిన సువర్ణ ఆభరణ దృష్టాంతము వలన స్పష్టమగుచున్నది. ఆద్యంతరహితుడై ఎల్లప్పుడు విలసిల్లు భగవంతుని చేత ఆద్యంతములందు లేనిదైన ప్రపంచము మధ్యకాలమందు సృష్టింపబడిన దగుటచే ప్రపంచమందియు బ్రహ్మముకంటె భిన్నము గాజాలదు.

ఆధావంచ యన్నాస్తి
మధ్యే తత్స్వప్న వన్నహి
మధ్యేపిచ తదేవాస్తి
భూషాభావే సువర్ణవత్ ॥

అనగా, సువర్ణముతో వస్తువులు చేయకముందును, ఆ వస్తువులు కరిగించిన తరువాతను బంగారమై, వస్తురూపమున నున్నప్పుడు సయితము బంగారమే యని విదితమైనట్లే, ప్రపంచకపు సృష్టికి పూర్వాపరములందుండు బ్రహ్మమే, ఆయన మాయాశక్తి కల్పనమగు స్వప్నతుల్యమైన ప్రపంచముగాని వేరు కాదు.

భ్రాంతి జనితములై స్వప్నతుల్యములగు ప్రాపంచిక రూపములన్నింటికి కారకుడు భగవంతుడు. అవన్నీ ఆయనవే కాని ఇతరములు కావు. అవి ఆయన మాయాశక్తి కల్పనలు. ఆత్మజ్ఞానముదయించినంతనే అవన్నియు ఆయనలో లయించిపోవును.

**9**

**యథాకాశో హృషీకేశో**
**నానోపాధిగతః విభుః**
**తద్భేదాద్ భిన్నవద్భాతి**
**తన్నాశే కేవలో భవేత్ ॥**

తాత్పర్యము :

అంతటా వ్యాపించియున్న ఆకాశము వివిధ ఉపాదులయొక్క సంబంధమువలన, వేరుగా కన్పించుచున్నను, ఉపాధులు నశించగా ఒకటే అగుచున్నది. ఆ ప్రకారమే, పలు విధ ఉపాధుల సంపర్కము వివిధ రూపములతో, సర్వసాక్షియగు భగవంతుడు గోచరించుచున్నను, ఉపాధులు నశింపగా ఒక అయి భాసించుచుండును.

వివరణ :

ఘటమునందున్న ఆకాశమును ఘటాకాశమని, మఠము యందున్న ఆకాశమును మఠాకాశమని పిలువబడినను ఘటము, మఠము నశించిన, వానియందలి ఘటమఠా కాశములు మహాకాశమేయై దానిలో కలసి పోవుచున్నవి. సర్వ తా వ్యాపించియున్న ఆకాశము ఘట మఠాదులవంటి ఉపాధులయందు వేరువేరుగా ఉంటున్నట్లు గోచరించుచున్నను, వాటి దోషముల నంటక, ఉపాధులు పోయిన వెంట- ఒకటే ఆకాశమగుచున్నది. అట్లే సర్వవ్యాపకుండును, సర్వజ్ఞుండును, సచ్చిదానంద స్వరూపుడునునగు భగవంతుడు ఒక్క యైనను, అజ్ఞాన కల్పితములగు ఉపాధులవలన

బహువిధ రూపములతో ప్రపంచమందు విహరించుచున్నట్లు గోచరించు చుండి ఆకాశమువలె వాని దోషముల నంటక, అన్నిటికీ సాక్షిమాత్రుడై విలసిల్లు చుండును. భగవంతుని మాయాశక్తివలన కల్పింపబడినవైన ఉపాధులన్నీ అనిత్యములై నశించుచు, మరల వాటి వాటి ఉత్పత్తిస్థానమగు భగవంతునిలో లయమొందు చుండును. ఏకస్వరూపుడైన భగవంతుని యందు ఉపాధుల వలననే అనేకత్వము ఆరోపింప బడుచున్నది గాని వాస్తవము కాదు. నిజముగా భగవంతు డొక్కడే కలడు. వేరు వస్తువులేదు. ఒక్క యగు భగవంతునియందు, ఇట్టి నిజము కప్పబడి, ఇంతటి పలువిధ ఉపాధిమయమగు ప్రపంచము గోచరించుచుండుటకు, అవిద్య లేక అజ్ఞానమే కారణమగుచున్నది. అజ్ఞానము వలననే మాయా కల్పితములగు ఉపాధులు గోచరించుచుండుట, అకర్తృత్వములో తగుల్కొనుట జరుగుచున్నది. నిరంతర స్వస్వరూపాను సంధానమగు ఆత్మ విచారము చేసికొన్నచో, అజ్ఞానము వదలిపోయి, ఉపాధులన్నీ ఆత్మలో లయించి, ఆత్మ స్వరూపుడు, సర్వసాక్షీభూతుడు అయిన భగవంతు డొక్కడే సర్వత్రా ఏకమాత్రుడై భాసించుచుండును. ఇట్టి స్థితియే ఆత్మానుభూతి పొందిన జీవన్ముక్తిత్వము.

యో యోనిం యోనిమధితిష్ఠత్యేకో
యస్మిన్నిదం సం చ విచైతి సర్వమ్।
తమీశానం వరదం దేవమీడ్యం
నిచాయ్యేమాం శాంతి మత్యంతమేతి॥

(శ్వేతాశ్వతరోపనిషత్తు 4-11)

ఏకస్వరూపుడైనా బహువిధ రూపాలతో ప్రపంచమందు యెవడు విహరించుచున్నాడో, ఎవనిలో నామరూపాత్మకమగు ప్రపంచము లయించుచు, మరల వివిధ రూపములతో సృష్టింపబడుచున్నదో, ఆ స్వయం ప్రకాశ

స్వరూపుడగు పరమాత్మను అనుభూతి పొందిన పరమ శాంతిని పొంద వచ్చును.



**నా నోపాధివశాదేవ**
**జాతినామా శ్రమా దయః**
**ఆత్మన్యారోపితాస్తోయే**
**రసవర్ణాది భేదవత్ ॥**



**తాత్పర్యము :**

వాసన, రంగు మున్నగునవి నీటికి సం క్రమించు చున్నట్లే, ఉపాధుల సంపర్కముచే ఆత్మకు కులము, రూపము, పదవి మొదలగు కల్పిత భావములు ఆరోపింప బడుచున్నవి.

**వివరణ :**

నామ రూప రహిత స్వయం ప్రకాశ స్వరూపమగు ఆత్మకు, అవ రోధములుగాని ప్రతిబంధకములుగాని అజ్ఞానజనితములగు ఆరోపితములే గాని యదార్థములు గావు. అన్ని ప్రతిబంధకములు ఆత్మకు ఉపాధి సంపర్కమువలన కలుగుచున్నవి. ఉపాధులు స్థూల, సూక్ష్మ, కారణ శరీర భ్రమలు. నిర్వికార, నామరూపరహిత చైతన్య స్వరూపమగు ఆత్మ, జడపదార్థముల సముదాయమైన స్థూలశరీరముతో తాదాత్మ్యము నొందుటవలన, దేహాత్మ బుద్ధి కలిగి, నేను పురుషుడను, బ్రాహ్మణుడను, నాకీ పదవి యున్నది, నాకు యీ ఆస్తులున్నవి అనుకొను అనేక రకముల

అసత్యపు కుల, రూప, కర్తృత్వ, భోక్తృత్వ భావపరంపరలు కలుగు చున్నవి. స్థూలశరీరము పంచభూతములగు పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశముల పంచీకరణము వలన ఉత్పన్నమగుచున్నది. స్థూల శరీరములోపల సూక్ష్మశరీరము గలదు. దీని లింగ శరీరమని కూడ అందురు. సూక్ష్మశరీరమునకు ముఖ్యాంగములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి పంచేంద్రియములు. విషయచింతన వీనివలన ఉత్పన్న మగుచుండును. పంచేంద్రియ ప్రేరణకు మూలస్థానము అంతఃకరణము. ఈ అంతఃకరణము నాలుగు విధములుగా ప్రకాశించుచుండును. అందు దీనిని అంతఃకరణ చతుష్టయ మందురు. మనస్సుగా ఇది సంకల్ప వికల్పములను చేయుచుండును. బుద్ధిగా ప్రతిచర్యలను నిశ్చయించుచుం డును. చిత్తముగా విషయములను చింతన చేయుచుండును. అహంకార ముగా "నేను", "నాది" యనెడి అభిమానము కలిగియుండును.

స్థూలశరీర మందలి భాగములన్నియు ప్రాణశక్తివలన చలించు చున్నవి. ఈ ప్రాణశక్తి వాయురూపములో పంచవిధములుగా శరీర మంతటనూ వ్యాపించినదై, ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములకు, భోజనాది పదార్థ ములను పచనము చేయుటకు, మలమూత్ర విసర్జనము గావించుటకు, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ సకల వ్యాపారములకును ఆధారమై యున్నది. దీని ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన మను ప్రాణాది వాయు పంచకమని అందురు. పంచేంద్రియములు, పంచభూతములు, వాయు పంచ కము, అంతఃకరణ చతుష్టయము కలిసి సూక్ష్మశరీరమై ఆత్మస్వరూపము నకు ఉపాధి యగుచున్నది.

సూక్ష్మశరీర ముత్పన్నమగుటకు మూలమైనది ప్రకృతిశక్తియగు మాయ. దీనిని కారణశరీర మందురు. సర్వ చరాచర ప్రపంచమును ఉన్నట్లు తోప చేయుటకు కారణభూతమైనది. మాయ, అవిద్య, అజ్ఞానము

ఒకటే. ఈ మాయను సత్వ, రజ, స్తమోగుణములను మూడు తలలు గల సర్పముగా వర్ణింతురు. త్రిగుణాత్మకమైన ఈ మాయ ఆత్మ స్వరూపమునకు ముఖ్యోపాధి. ఇది ఆవరణ విక్షేప శక్తులను కల్పించి ఆత్మస్వరూపమును మరుగు చేయుచుండును.

పైన వివరించిన స్థూల, సూక్ష్మ, కారణశరీరములు, ఆవరణ విక్షేపములు, అంతఃకరణ చతుష్టయము, పంచభూతములు, ఇంద్రియ గోచరమగు నామరూపాత్మకమైన ప్రపంచము, ఇవి యన్నియు ఆత్మకు ఉపాధులై ఆత్మ యొక్క యదార్థస్వరూపమును మరుగుపరచుచున్నవి. ఆత్మస్వరూపమునకు విరుద్ధాంశములగు ఆకారము, పరిమితత్వము, అల్పత్వము మున్నగు కల్పిత అనాత్మధర్మము లాత్మకు సంక్రమించుచున్నవి. స్వచ్ఛమైన నీటికి వాసన, రంగు మొదలైన వెట్లు నీటి యదార్థ స్వరూపమును వేరుగా గోచరింపజేయుచున్నవో, అట్లే పైన వివరించిన ఉపాధుల సంబంధము వలన ఉపాధులయొక్క ధర్మములాత్మ యందారోపింపబడుచున్నవి. ఇది యంతయూ అవిద్యాకల్పితమై, స్వప్నమునందలి విషయ జాతములవలె అసత్యములేకాని యధార్థములు కావు. అనగా ఇవి జ్ఞానమువలన వదిలించుకోబడదగినవే కాని, ఎప్పుడూ ఆత్మస్వరూపమును అంటి శాశ్వతముగా యుండునవి గావు. మెలకువ కలిగినతోడనే స్వప్న పదార్థజాత మంతయు అసత్యమైనట్లు, జ్ఞానము కలిగినంతనే సర్వోపాధులు అసత్యములే యగును.

**పఞ్చీకృత మహాభూత**
**సంభవం కర్మసంచితం**
**శరీరం సుఖదుఃఖానాం**
**భోగాయ తనముచ్యతే ॥**

**తాత్పర్యము :**

ఆత్మ, స్థూల దేహము ద్వారా సుఖదుఃఖానుభవములు పొందుచున్నది. స్థూల దేహము పూర్వార్జిత పారకర్మానుసారము నిర్ణయింపబడి ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివియగు సూక్ష్మభూతముల పంచీకరణము (అనగా ఒక్కొక్క సూక్ష్మభూతములో సగము భాగమునకు తక్కిన నాలుగు భూతములలో యొక్కొక్క దాని అష్టభాగమును కలపగా నేర్పడు భూతసమ్మేళనము వలన స్థూలరూపము దాల్చుచున్నది.

**వివరణ :**

స్థూల శరీరము అన్నమయకోశము అనబడుచున్నది. అజ్ఞానజనితమగు అహంకారమునకు ఆశయమై, పంచభూతము లనెడి పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశముల పంచీకరణము వలన నుత్పన్నమగుచు, చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, నరములు మున్నగు జడపదార్థ సముదాయమై, మలమూత్రాదులతో నిండి, అహంకారియగు జీవునకు భోగసాధన మగుచున్నది. ఈ స్థూల దేహము పుట్టుట, ఉండుట, పెరుగుట, మార్పుజెందుట, కృశించుట, నశించుట అను ఆరు ధర్మములు కలిగియున్నది. వీనినే షడ్భావ వికారము లందురు. ప్రశాంతమైన ఆత్మ స్థూలశరీరముతో, బాహ్యములగు శబ్ద, స్పర్శ, రూప, రసగంధము లగు ఇంద్రియ విషయములను అనుభవించుచు "స్థూలభోగాయతన"మని చెప్పబడుచున్నది. ఇవిగాక కుల, మత, వర్ణాశ్రమాది సాంఘిక వివక్షములును, రోగముల, బాధల అనుభవములును, ఇతరుల వలన సంభవించు నిందాస్తుతులును మొదలగున వన్నియూ స్థూలశరీరము యొక్క ధర్మములు.

పృథివ్యాపస్తేజోవాయు రాకాశములనెడి పంచభూతముల పంచీకరణము వలన స్థూలశరీర ముత్పన్నమగుచున్నదని పైన చెప్పబడినది. పంచీకరణ మనగానేమో వివరముగా తెలిసికొనవలసిన అంశము. తొలుదొల్త పంచభూతములె ట్లుద్భవించినవో తెలిసికొనవలెను.

స్వయం పకాశము, సర్వవ్యాపకము, నామరూప రహితమునగు ఆత్మస్వరూపము నుండి, పకృతియొక్క పథమ వికారమగు ఆకాశ ముద్భవింవగా, శబ్దముత్పన్నమైనది. శబ్దగుణకమైన ఆకాశము నుండి, రెండవ పకృతి వికారమగు వాయువుపుట్టగా, శబ్దమునకు తోడై, స్పర్శ ఉద్భవించినవి. ఆకాశసహిత వాయువు వలన శబ్దస్పర్శలు ఉత్పన్నమవగా, వీనికి తోడైన రూపము లేక తేజము (అగ్ని) ఉద్భవించినది. ఇవి ఒకదానికంటె ఇంకొకటి స్థూలతరమైనవి. శబ్దముకంటె స్థూలమైనది వాయువు. వాయువుకంటె స్థూలమైనది తేజము (అగ్ని). శబ్ద, స్పర్శ రూపము లుత్పన్నమగుటచే వీనినుండి, వీనికంటె స్థూలమైనది రసము అనగా జలము పుట్టినది. జలమునుండి అంతకంటె స్థూలతరమగు గంధ గుణోపేతమైన భూమి అవతరించెను భూమినుండి అన్నము. అన్నము వలన అన్నమయకోశమగు శరీరము కలుగుచున్నవి. అజ్ఞానము వలన "నేను, నావి" అనుకొనెడి ఈ స్థూల దేహము, పైన పేర్కొన్న విధముగా పంచ స్థూల భూతములవల్ల, పూర్వజన్మకృత కర్మా నుసారము ఉత్పన్నమై ఆత్మకు దేహాభిమానము, అసత్యపు జీవత్వము కల్పించి, భోగసాధనమగుచున్నది. పంచీకరణమనగా, పృథివ్యాది పంచభూతములలో ఒక్కొక్క దానిని రెండేసి భాగములు చేసి, అర్థభాగమును వేరుగ నుంచి, మిగతా అర్థ భాగమును నాలుగేసి భాగములు చేసి, ఒక్కొక్క భూతము యొక్క సగము భాగమును, తక్కిన భూతముల యొక్క ఎనిమిదవ భాగము (అనగా సగములో నాల్గవ భాగమును) చేర్పగా ఏర్పడిన సమ్మేళనము.
ఉదా :- పృథివిని రెండు భాగములు చేయవలెను. సగము భాగమును వేరుగ

నుంచవలెను. మిగిలిన సగభాగమును నాలుగుపాళ్ళు యవలెను. ఈ విధముగ మిగిలిన నాలుగు భూతములను విభజింపవలెను. అట్లు విభ జించిన పిమ్మట ఒక్కొక్క భూతముయొక్క అర్థభాగమునకు, మిగిలిన నాలుగు భూతములయొక్క 1/8 వ భాగమును అనగా సగములో నాల్గవ భాగము ర్చపలెను. ఈ విధముగా విభజించి తయారు కాబడినవి పంచీ కృత భూమి, పంచీకృత జలము, పంచీకృత జము అగ్ని , పంచీకృత వాయువు, పంచీకృత ఆకాశము ఏర్పడును. ఈ విధముగా శరీరోత్పత్తి జరుగుచున్నది.

పఞ్చ ప్రాణమనోబుద్ధి
దశేంద్రియ సమన్వితమ్
అపఞ్చీకృత భూతోత్థం
సూక్ష్మాంగం భోగసాధనమ్ ॥

**తాత్పర్యము :**

స్థూలశరీరము లోనిది సూక్ష్మశరీరము (**Subtle body**). ఇది ప్రాణవాయు పంచకము, ద ం ద్రియములు ఐదు జ్ఞా ం ద్రియములు ఐదు క ం ద్రియములు , మనస్సు, బుద్ధి కలిగి వీటన్నిటి కలయిక లేక సమే శనము వల్ల నుత్పన్నమై ఆత యొక్క సుఖదుఃఖాను భవములకు కారణమగుచున్నది.

**వివరణ :**

సూక్ష్మ శరీరమును లింగశరీరమని కూడ అందురు. సూక్ష్మశరీరమునకు ముఖ్యాంగములు శబ్ద స్పర్శ, రూప, రస, గంధము లనెడి పంచేంద్రియములు. విషయములను గ్రహించుచు, విషయచింతనలకు కారణములగు ఈ పంచేంద్రియములు జ్ఞానేంద్రియము లనబడుచున్నవి. ఈ జ్ఞానేంద్రియముల ద్వారా గ్రహించెడి విషయములను, బుద్ధి ఉత్తరవు ప్రకారము క్రియారూపములుగా యొనర్చునవి ఐదు కర్మేంద్రియములు. ఇవి వాక్కు (మాట), పాణి (చేతులు-ఇచ్చిపుచ్చుకొను ప్రవృత్తి), పాదము (కాళ్ళు-గమనము), పాయువు (నిసర్గ-విసర్జన), ఉపస్థ (ఆనంద-కామక్రీడ).

సూక్ష్మశరీరము ఇంద్రియ కూటము. సతతము, శబ్దాది పంచ విషయములచే ప్రేరేపింపబడుచు, ఇంద్రియములు మానవుని బంధించి, తన నిజస్వరూపమును మరుగుపరచి, అనిత్యమగు శరీరమే తాననెడి అహంకారమును విజృంభింపజేయుచుండును. పంచేంద్రియ ప్రేరణకు మూలస్థానము అంతఃకరణము. అంతఃకరణమును గూర్చి విపులముగా 10వ శ్లోక వివరణలో చెప్పబడినది.

పైన వివరించిన శబ్ద, స్పర్శ, రూప, రస గంధములను గ్రహించు జ్ఞానేంద్రియములు, వాక్కు, పాణి, పాయువు, పాదము, ఉపస్థలను కర్మేంద్రియములు, పృధివి, జలము, తేజము, వాయువు, ఆకాశములగు పంచభూతములు, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము లనెడి వాయుపంచకము, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారములగు అంతఃకరణ చతుష్టయము, ఇవి అన్నియు కలసి సూక్ష్మశరీరమై, సతతము శబ్దాది పంచవిషయములచే ప్రేరేపింపబడుచు, ఇంద్రియ సుఖానుభవములలో ఆత్మను బంధించి అనేక సుఖదుఃఖానుభవములలో ముంచి, అనిత్య

మగు స్థూలశరీరమే తాననెడి అహంకారమును విజృంభింప యుచుండును. దేహాత బుద్ధి కలుగుటకు, పపంచమను మాయాసృష్టిని జా గదవస్థలో తోప యుటకు, సూక్ష్మశరీరమే కారణమగుచున్నది. దీనివలననే స్వప్నావస్థయందు స్వప్నప్రపంచము సృష్టింపబడుచున్నది.

అనాద విదా- నిర్వాచా-
కారణోపాధి రుచ-తే
ఉపాధి త్రితయా దన-
మాత్మాన మవధారయేత్ ॥

తాత్పర్ ము :

ఆత్మయందారోపింపబడిన అవిద్య లేక అజ్ఞానము వర్ణింపనలవికానిదై ఎచటనుండి మొదలగుచున్నదో తెలియనిదై అన్ని అనర్థములకు కారణమగుచున్నది. కాని ఆత్మ మూడు ఉపాధుల కంటె నిర్దిష్టముగా భిన్నుడైన వాడని తెలిసికొనవలెను.

వివరణ :

పై శ్లోకములో వివరించిన సూక్ష్మ శరీరముత్పన్న మగుటకు మూలమైనదే అవిద్య, లేక అజ్ఞానము. ని కారణశరీర మందురు. ఇదియే ప ంప నలవికాని అవ్యక్తకరమగు మాయ. అనిర్వచనీయమగు ప్రకృతి శక్తి. అసత్యమైన సర్వచరాచర పపంచమును, ఆత యందు

గోచరింప యుటకు కారణభూతమైనది. మాయ, అవిద్య, అజ్ఞానము ఒకటే. ఈ అ--ామను మాయ, ఉన్నదియని గాని, లేదు అని గాని చెప్పుటకు వీలు లేనిది. ఏలయన. శాశ్వతముగా నుండునదైనచో, పరమాత్మవలె నిత్య మైనదై, ఎల్లప్పుడూ నశించక శాశ్వతముగా నుండవలెను. కాని ఇది అట్లు శాశ్వతముగా నుండునది కాదు-అశాశ్వతమైనది. బ్రహ్మజ్ఞానముద యించిన తోడ అజ్ఞానముతోసహా అజ్ఞానజన్యములగు సర్వమూ పటా పంచలగును. ఇక, ఇది అసలే లేనిదైనచో, ఎల్లప్పుడునూలేక యుండ వలెను. అట్లుగాక ప్రమాణము- ప్రత్యక్షముగ తెలియబడుచున్నదగు టచే, లేనిదని చెప్పుటకు సాధ్యముకాదు. ఇది ఎపుడు ఉద్భవించినదో, ఎట్లు ఉద్భవించెనో ఎవరి తెలియనిది. అందువలననే దీనిని అనిర్వచ నీయమని అందురు. పైగా, ఇది బ్రహ్మ స్వరూపముకంటె వేరుకానిదని కాని, వేరైనదని కాని చెప్పనలవిగానిది.

మాయను సత్వ, రజ, స్తమోగుణములను మూడు తలలుగల సర్పముగా వ-ంతురు. త్రిగుణాత్మకమైన ఈ మాయ, ఆత్మ స్వరూప మునకు మూలావరోధమై, ఆవరణ విక్షేప శక్తులను కల్పించి ఆత్మస్వరూ పమును మరుగు యుచున్నది. ఆవరణ శక్తివలన సర్వ తా వ్యాపించి యున్న సత్య వస్తువగు ఆత్మ తెలియదనుకొనెడి, లేదనుకొనెడి, ప్రవృత్తి కలుగును. ఇంద్రియ గోచరములగు శరీర ప్రపంచాదులే నిత్యమైనవని, దేహమే ఆత్మ స్వరూపమనుకొను ప్రవృత్తి తోచును. సకల కర్మలకు మూలమైన హమే ను అనుకొనెడి హాభిమానము, లేక దేహాత్మబుద్ధి, ఆవరణ విక్షేప శక్తులవలన ఉత్పన్నమగును. ఆత్మకంటె అన్యమగు దృష్టిని కలిగించుటయే, ఆవరణ విక్షేపశక్తుల కార్యము. మన సహజ స్వరూపమగు ఆత్ను వేరుచేయుచు, -ద బుద్ధిరూపమగు యవనిక Veil of Separateness) ను కల్పించి, ఆవరశక్తియే, విక్షేప శక్తికి కారణమగుచున్నది. తమోగుణమయమైన ఆవరణశక్తి నుండి, రజోగుణ

ప్రవృత్తములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాది దుర్గుణ భ్రాంతులుత్పన్న మగుచున్నవి. మనోవికారములైన రాగ ద్వేషాదులు, సుఖదుఃఖములు, సర్వకామ్య కర్మ కలాపములు. విక్షేపశక్తి వలననే సృష్టింపబడుచున్నవి. విక్షేప మనగా బాహ్యవస్తు ఆభాస చింతనము. దీని వలన అనేక అనర్థములు వాటిల్లి ఆత్మానుభూతికి ప్రబలమగు ప్రతిబంధ కము కలుగుచున్నది.

ఆత్మకు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములు ఉపాధులు. ఈ ఉపాధుల తత్త్వము పూర్తిగా తెలిసికొని, ఆత్మ వీటన్నిటికంటె విలక్షణు డని తెలిసికొనవలెను. పైన వివరించిన స్థూల, సూక్ష్మ, కారణ శరీర ములు, ఆవరణ వి క్షేపములు, అంతఃకరణ చతుష్టయము, ఇంద్రియ గోచరములగు నామరూపాత్మకమైన ప్రపంచము మొదలగు సమస్త బాహ్య దృశ్యజాతము అనాత్మ పదార్థములని, ఆత్మ వీటన్నింటికి నిర్లిప్తముగా భిన్నుడని గ్రహించుకొనవలెను.

పఞ్చకోశాదియోగేన
తత్తన్మయ ఇవస్థితః
శుద్ధాత్మా నీలవస్త్రాది
యోగేనస్ఫటికో యథా ॥

**తాత్పర్యము :**

నీలము, ఎరుపు మున్నగు రంగుల వస్త్రముల మీద స్ఫటికము నుంచిన, స్ఫటికము ఆయా రంగులు గల

దానివలె గోచరించుచుండును. అట్లే పంచకోశములగు, అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయ కోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశములతో తాదాత్మ్యత నొందిన శుద్ధాత్మ ఆయాకోశములవలె గోచరించును.

వివరణ :

స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను, వేరు విధముగా కూడ శాస్త్రములు వివరించినవి. అవియే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. వీనిని పంచకోశములందురు.

స్థూల శరీరము అన్నమయకోశము. అన్నము భుజించుట వలన గలుగు శుక్లశోణితముల సంయోగము వలన ఉత్పన్నమగుచు, అన్నము వలన వృద్ధియై జీవించుచు, అన్నము లేనియెడల నశించును కనుక, అన్నమయ మనియు, ఒరలో ఖడ్గము ఉండునట్లు శరీరములో ఆత్మయుండుట వలన కోశమనియు, స్థూలదేహము అన్నమయకోశమని వ్యవహరింపబడుచున్నది.

అన్నమయకోశములో నుండునది ప్రాణమయ కోశము. స్థూల శరీర మందలి భాగములన్నియు, అనగా కర్మేంద్రియములు, ప్రాణశక్తి వలన చలించుచున్నవి. ఈ ప్రాణశక్తి వాయురూపములో పంచ విధములుగా శరీర మందంతటను వ్యాపించినదై, ఉచ్ఛ్వాస నిశ్వాసములకు, భోజనాది పదార్థములను పచనము చేయుటకు, మలమూత్ర విసర్జనము గావించుటకు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సకల వ్యాపారములకు ఆధారమై యున్నది. దీని ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన మను ప్రాణాది వాయు పంచకమని అందురు. ఈ వాయు పంచకమును, కర్మేంద్రియములను కలిపి ప్రాణమయకోశ మనబడుచున్నది.

ప్రాణమయకోశములో మనోమయకోశము కలదు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచ విషయములను గ్రహించెడి శ్రోత్రము (చెవులు), త్వక్కు (స్పర్శ), అక్షి (నేత్రము), జిహ్వ (నాలిక), ఘ్రాణమ్ (నాసిక) అగు పంచేంద్రియములును మనస్సుతో కూడుకొని, మనోమయకోశ మనబడుచున్నది. విషయములను గ్రహించెడి ఈ పంచేంద్రియములు, జ్ఞానేంద్రియము లనబడును.

మనోమయకోశము లోనిది విజ్ఞానమయకోశము. పైనుదహరించిన ఐదు జ్ఞానేంద్రియములతో కలసిన బుద్ధి, "ఇది నా శరీరము", "నేను ...యుచున్నాను", "నేను తినుచున్నాను" అను కర్తృత్వ భోక్తృత్వాహంకారముతో గూడి, విజ్ఞానమయకోశ మనబడుచున్నది. ఈ విజ్ఞానమయకోశమే, ...హాత బుద్ధి కలుగుట, జీవు డనబడును.

అయం మహానహంకారవృత్తిమాన్ కర్తృలక్షణః,
సర్వ సంసారనిర్వోఢా విజ్ఞానమయ శబ్దభాక్ ॥
(ఆదిశంకరుల శ్లోకము)

అనగా, దేహేంద్రియాదులందు "నేను" అను ఆత్మబుద్ధియగు అహంకారము గలిగి, జరుగుచున్న కార్యములన్నిటికి నేను కర్తను అను కర్తృత్వభావముతో సర్వసంసార కార్యకలాపములు నిర్వర్తించుచుండుట ఈ విజ్ఞానమయకోశ లక్షణము.

విజ్ఞానమయ కోశమందు ఆఖరిది, ఐదవదీ యగు ఆనందమయ కోశము కలదు. శుద్ధ సత్వగుణోపేతులగు మహనీయులకు, అహంకార మమకారాది సర్వ అనాత్మ సముదాయమును వదలిపోవుటచే, నిరతిశయానందము కలుగ యునదియే, ఆనందమయకోశము. ఇది ఇష్టవస్తువు ప్రాప్తించుట వలన నుత్పన్నమగును. అజ్ఞానాహంకారము లెంతవరకు ఉండునో అంతవరకు తమోగుణపరిణామమై ప్రియమోద ప్రమోదాది గుణములు గలిగి యుండును.

ప్రాణమయకోశములో మనోమయకోశము కలదు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను పంచ విషయములను గ్రహించెడి శ్రోత్రము (చెవులు), త్వక్కు (స్పర్శ), అక్షి (నేత్రము), జిహ్వ (నాలిక), ఘ్రాణమ్ (నాసిక) అగు పంచేంద్రియములును మనస్సుతో కూడుకొని, మనోమయకోశ మనబడుచున్నది. విషయములను గ్రహించెడి ఈ పంచేంద్రియములు, జ్ఞానేంద్రియము లనబడును.

మనోమయకోశము లోనిది విజ్ఞానమయకోశము. పైనుదహరించిన ఐదు జ్ఞానేంద్రియములతో కలసిన బుద్ధి, "ఇది నా శరీరము", "నేను చేయుచున్నాను", "నేను తినుచున్నాను" అను కర్తృత్వ భోక్తృత్వాహంకారముతో గూడి, విజ్ఞానమయకోశ మనబడుచున్నది. ఈ విజ్ఞానమయ కోశమే, ఆత్మ బుద్ధి కలుగుట, జీవు డనబడును.

అయం మహానహంకారవృత్తిమాన్ కర్తృలక్షణః,
సర్వ సంసారనిర్వోఢా విజ్ఞానమయ శబ్దభాక్ ॥

(ఆదిశంకరుల శ్లోకము)

అనగా, దేహేంద్రియాదులందు "నేను" అను ఆత్మ బుద్ధియగు అహంకారము గలిగి, జరుగుచున్న కార్యములన్నిటికి నేను కర్తను అను కర్తృత్వభావముతో సర్వసంసార కార్యకలాపములు నిర్వర్తించుచుండుట ఈ విజ్ఞానమయకోశ లక్షణము.

విజ్ఞానమయ కోశమందు ఆఖరిది, ఐదవదీ యగు ఆనందమయ కోశము కలదు. శుద్ధ సత్త్వగుణోపేతులగు మహనీయులకు, అహంకార మమకారాది సర్వ అనాత్మ సముదాయమును వదలిపోవుట, నిరతిశయానందము కలుగ యునదియే, ఆనందమయకోశము. ఇది ఇష్టవస్తువు ప్రాప్తించుట వలన నుత్పన్నమగును. అజ్ఞానాహంకారము లెంతవరకు ఉండునో అంతవరకు తమోగుణపరిణామమై ప్రియమోద ప్రమోదాది గుణములు గలిగి యుండును.

**వివరణ :**

పంచకోశములను గురించి విపులముగా 14వ శ్లోక వివరణలో చెప్పబడినవి. అవిద్య లేక అజ్ఞానము వల్ల, పంచకోశములు గోచరించుచున్నవి. జడములగు ఈ పంచకోశములకు పరమాత్మ విలక్షణుడై యున్నాడు. కల్పితావరోధములగు ఈ పంచకోశములు యదార్థములు గావని, యుక్తుల - తను నిత్యా నిత్యవస్తు విచారణవల్లను గహించుకొని, వాటిని నిషేధించిన, స్వ స్వరూప పరమాత్మ పకాశించుచుండును. ఈ విషయము వివేకచూడామణి యందు ఆదిశంకరులు ఈ కింది ాకములో వ్ ్కరించిరి :-

"పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః శ్రుతేః
తన్నిషేధావధిః సాక్షీ బోధరూపోఽవ శిష్యతే॥

తాను నిజముగా తనయందు సర్వ తా అహమ్ అహమ్ (నేను, నేను) అని భాసించుచు, స్ఫురించుచుండు, నామరూపములు లేని చైతన్య స్వరూపుడు. ఎట్టి పరిమితములేని అనంతుడు. అనాత్మ పదార్థములైన పంచకోశములకూ సాక్షి మా తుడు. ఈ యధార్థ సత్యమును సాక్షాత్కరించు కొనుటకు, పంచకోశములను దృఢ విశ్వాసముతో వాటి యధార్థ స్వభావమును పదేపదే విచారించుచు గుర్తించుకొని, " తి తి" అనగా ఇది నేనుకాదు, ఇది నుకాదు, అనుకొనుచూ వాటిని విస ంప వలెను. ఇట్లు సంతత ధృఢాభ్యాసముచే ఆత్మస్వరూపము కంటె భిన్నమై ఆరోపితములగు పంచకోశములను మిధ్యగా నిరసింపగా, మిగులునది స్వ స్వరూపమగు ఆత యే యగును. అట్టి ఆత్మస్వరూపము మనయదార్థ స్వరూపము. అది స్వతః సిద్ధము, స్వయం జ్యోతిః స్వరూపమునై ఎల్లకాలముల యందు ఎక్కడలా భాసించుచు యున్నది. ధ్యానము

రోకటితో దంచుట వలన పై పొర - లేక ఊక తొలగిపోయి, స్వచ్ఛమైన బియ్యమును పొందుచున్నాము. అట్లే ఆత్మావరోధములైన మిథ్యా స్వరూపములగు ఈ పంచకోశములను నిషేధించగా, శేషించునది పరమాత్మయే. ఇదియే సర్వ సాక్షియై యుండు మన సహజ స్వరూపము.

## 6

**సదాసర్వగతోఽప్యాత్మా**
**నసర్వత్రావభాసతే**
**బుద్ధావేవావ భాసేత**
**స్వచ్ఛేషు ప్రతిబిమ్బవత్**

**తాత్పర్యము :**

అంతటా వ్యాపించియున్న ఆత్మ ప్రతి వస్తువునందు ప్రకాశింపకున్నను, స్వచ్ఛమైన నీటియందును, మాలిన్యములేని అద్దమందును ప్రతిబింబము ఎట్లు గోచరించునో అట్లే- పరిశుద్ధ బుద్ధియందు ప్రత్యక్షముగా భాసించును.

**వివరణ :**

సర్వమూ పరమాత్మ స్వరూపమే అయివున్నది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనగా ప్రపంచమంతా బ్రహ్మ స్వరూపమే. భగవంతుడు కానిదేదీ ఈ ప్రపంచములో లేదు. భగవంతుడు లేని చోటు లేదు. అంతటా వ్యాపించి వెలయుచున్నను ఆ పరమాత్మ ఎందుకు గోచరించు చుండుట లేదని అనుకొనుచుందురు దానికి కారణము అజ్ఞానపు

మాలిన్యములు దానిని ఆవరించియుండుటయే. ఈ అజ్ఞానపు మాలిన్యము లేవో గుర్తించుకొని వానిని తొలగించుకొనిన, చిత్తశుద్ధి కలిగి స్వతః సిద్ధము, స్వయం ప్రకాశమునగు ఆత్మ ప్రకటితమగును. జడసముదాయము లగు లోకము, శరీరము, పంచేంద్రియ కూటమి, అంతఃకరణ చతుష్టయమగు మనః చిత్త బుద్ధ్యాహంకారములు- ఇవన్నీ అజ్ఞానంవల్ల భాసించు మాలిన్యములు. మిథ్యాజన్యములు. ఆరోపితములు. ఇవి గోచరించుటకు కారణము మిథ్యాజ్ఞానము. "నేను" "నాది" "నేను చేయుచున్నాను", అనుకొనెడి, అహంకార, మమకార, కర్తృత్వ భావమే మిథ్యాజ్ఞానము. దీనినే ప్రకృతి వికారమగు విజ్ఞానమయ కోశమని కూడ అందురు. అరిష్టదాయకమగు ఈ అజ్ఞానపు మాలిన్యములను పోగొట్టుకొను నిమిత్తమే సర్వసాధనలు ఉద్దేశింపబడినవి. వాంఛారహితమైన మనస్సుతో మనఃపూర్వకముగా శమదమాదులను పాటించుచు, స్తోత్రము, జపము, ధ్యానము, యోగము, జ్ఞానము ఇత్యాది ఆధ్యాత్మిక సాధనలు నిరంతరము చేయుచుండిన అజ్ఞానపు మాలిన్యములు తొలగి చిత్తశుద్ధి కలుగును. అపుడు సచ్చిదానందమయుడగు పరమాత్మ మన నిజస్వరూపముగా భాసించును.

ఎట్టి మలినము లేక పరిశుభ్రముగానున్న అద్దమందును నీటియందును స్పష్టముగా ముఖము ఎట్లు చూడబడుచుండునో, అట్లే నిరంతరమగు ఆధ్యాత్మిక సాధనలవలన, ఆత్మను మరుగుపరచుచున్న అజ్ఞానపు మాలిన్యములను పోగొట్టుకొనిన, బుద్ధి పరిశుద్ధమై అందు ఆత్మ ప్రకటితమై నిరవధికముగా భాసించును.

ఆత్మ బుద్ధి గుహయందుండును. కనుక, బుద్ధి అపరిశుద్ధముగా యున్న, ఆత్మ మరుగునపడి అగోచరముగానుండును. భగవంతుడగోచరుడగుటకిదియే కారణము. తీవ్రమైన వైరాగ్యము, ముముక్షత్వము- కలిగిన

ఏ మానవో త్తముడు, నిత్యా నిత్యవి కముతో ఆధ్యాత్మిక సాధనలను చేసుకొని బుద్ధిగుహను పరిశు భ్రము చేసికొనునో, అట్టి శుద్ధ బుద్ధిగలవాడు ఆత తా యై అనిర్వచనీయమైన ఆనందముతో ప్రకాశించుచుండును.

**దేహేంద్రియ మనోబుద్ధి**
**ప్రకృతిభ్యో విలక్షణమ్**
**తద్ వృత్తి సాక్షిణం విద్యా**
**దాత్మానం రాజవస్సదా ॥**

తాత్పర్యము :

శరీరమునకు, జ్ఞానేంద్రియములకు, మనస్సు, బుద్ధి మున్నగు సమస్త ప్రకృతి, ఆత్మ విలక్షణుడని, వాటి కార్య కలాపములకు సాక్షియై రాజుతో పోల్చతగినవాడై యుండు నని తెలిసికొనుము.

వివరణ :

ఆత్మ జ్ఞానమును పొందుటకు మున్ముందు, అనాత్మ పదార్థముల యదార్థమును గుర్తించి వానిని గురించి చింతించుట వ్యర్థమని తెలిసికొని వానిని విసర్జింపవలెను. అనాత్మ పదార్థములగు శరీరము, పంచేంద్రియ ములు, పంచ భూతములు, ప్రపంచము, మనస్సు, బుద్ధి మున్నగు సమస్త ప్రకృతి జాతము ఆత్మవల్లనే సృష్టింపబడి, మరల ఆత్మయందే లయ మొందుచున్నవి. అనాత్మ పదార్థము లాత్మయందు జనించుచు ఆత్మ యందే మరల లయించుచున్నను, వీటన్నిటికీ ఆత్మ విలక్షణుడని తెలిసి

కొనవలెను. ఎట్టి మార్పులూ జెందక వీటన్నిటి సాక్షిభూతుడైన ఆత్మ ఆనాశ పదార్థముల రాకపోకలను, వాటి వాటి పోకడలను గమనించుచు, దేశము నేలు రాజువలె సర్వాధిష్ఠానమై యుండునని తెలిసికొనవలెను. ఆత్మయొక్క సర్వాధిష్ఠానత శ్వేతాశ్వతరోపనిషత్తునందు అ క శ్లోక ములలో చక్కగా వివరించబడినది. అందు కొన్ని శ్లోకములు కింద పేర్కొనబడినవి.

మహాన్ ప్రభుర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః ।
సునిర్మలామిమాం ప్రాప్తిమిశానో జ్యోతిరవ్యయః ॥

ఆత్మ స్వరూపుడైన ఆ పురుషుడు నిజముగా మహా ప్రభువు. సర్వ నియామకుడు. జ్యోతిః స్వరూపుడు. అత్యంత నిర్మలమైనవాడు. ఇతనివల్ల, అన్ని జీవుల బుద్ధులూ చలించుచు అభివ్యక్తమగుచున్నవి.

సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
సర్వస్య ప్రభుమీశానం సర్వస్య శరణం సుహృత్ ॥

ఇంద్రియములన్నింటికీ అతీతుడై యుండి సర్వేంద్రియ వ్యాపార ములలోనూ ప్రకాశిస్తూ, సర్వమునకూ, నియామకుడును, ప్రభువునై అలరారు సర్వశరణ్యుడైన ఆత్మ స్వరూపుడు ఆరాధ్యుడు.

యో దేవానా మధిపో యస్మిన్ల్లోకా అధి శ్రితాః ।
య ఈశే అస్యద్విపద శ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమః ॥

దేవతలకు ప్రభువు ఎవరో సర్వలోకములు ఎవనియందు సాగు చున్నవో, ద్విపాదులగు మానవులను, చతుష్పాదులగు జంతువులను ఎవరు

పాలించుచున్నారో, సత్‌చిదానంద స్వరూపుడగు ఆ భగవంతుడు ఎల్ల ప్పుడూ ఆరాధ్యుడు.

న ఏవ కా భువనస్యగోప్తా, విశ్వాధిపః సర్వభూ షు గూఢః ।
యస్మిన్‌యుక్తా బ్రహ్మర్షయో వతాశ్చ, తమేవం ాత్వామృత్యు
పాశాంశ్ఛి నత్తి ॥

అవసరమైనప్పుడు లోకకళ్యాణార్థమై ధర్మ సంస్థాపన కొరకు ఆయ పపంచమునకు రక్షకుడై యున్నాడు. సర్వలోకములకూ పభువై, అన్ని వులయందు నిగూఢుడై దాగియున్నది ఆయనే. బహ ర్షులు, దేవతలు ఆయన సాక్షాత్కరించుకొని జనన మరణ పాశముల నుండి విముక్తులైనారు.

న తన్మయో హ్యమృత ఈశసంస్థో
ః సర్వగో భువనస్యాస్య గోప్తా ।
య ఈశేస్య జగతో నిత్యమేవ
నాన్యో హేతుర్విద్యత ఈశనాయ ॥

ఈ సర్వలోకములను శాశ్వతముగా పరిపాలించే వాడతడే. అవి నాశి, సర్వజ్ఞుడు, సర్వవ్యాపి అయిన, ఆ జగద్రక్షకుడే తప్ప, ఈ లోక ములను శాస్వతముగా పరిపాలించే వారు ఇతరులెవరూ లేరు.

**వా వృతేష్వం దియేష్వాత్మా**
**వా షా వా వివేకినామ్।**
**దృశ్యతేఽభ్రేషుధావత్సు**
**ధావని వయథాః ॥**

**తాత్పర్యము :**

ఆకాశములో మేఘములు కదలు చుండునపుడు చం ద్రుడు కదలుచున్నట్లు గోచరించుచుండును. అట్లే, ఇం ద్రియములు చలించుచుండుటవలన నిర్వికారస్వరూపు డగు ఆత్మకు చలనము గలుగు చున్నట్లు తోచుచుండును.

**వివరణ :**

ఆత్మ, ఎట్టి మార్పులు, చలనములు లేక, నిర్వికార, నిశ్చల, నిర్బాధాయుతుడై వెలయుచున్నను, ఇం ద్రియములతో తాదాత్మ్యము నొందుట వలన, ఇం ద్రియ ప్రేరణా జన్యములగు కార్య కలాపము లన్నియూ ఆత్మ యనుకొను భ్రమ భావముత్పన్నమగుచున్నది. యదార్థముగా ఆత్మకు ఎట్టి చలనము గాని, కార్యకలాపములుగాని లేవు. ఆదిశంకరుల "స్వప్నస్మృతి" యందుకూడ ఈ విషయము యీ కింది శ్లోకమందు జెప్పబడినది :-

గంతవ్యం చ తథానైవ సర్వగ స్యాచలస్య చ,
నోర్ధ్వం నాధ స్తిరోవాఽపి నిష్కల సా గుణ త్వతః॥

సర్వాంతర్యామి యగు బ్రహ్మము నిశ్చలుడు. నిర్వికారుడు. ని ష్క్రియుడు. ఆయనకు గమనము గాని, గంతవ్య స్థానముగాని లేదు. ఆయన దిగంబరుడు. అనగా ఉత్తర దక్షిణములుగాని, తూర్పు పడమరలు గాని ఆయనకు లేవు. అనంతమైన యేకైక మాత్రుడు. అట్టి ఆత్మకు చలనమున్నటు తోచుట భ్రాంతియే కాని యదార్థము కాదు. ఆకాశముపై మేఘముల గమనము వలన చం ద్రుడు పరుగిడుచున్నట్లు భ్రమించు చుందురు. అట్లే పడవ ముందుకు సాగుచున్నప్పుడు ఎట్టి కదలికాలేని

గట్టు మీది చెట్లు వెనక్కు పోవుచున్నట్లు కనబడును. మూఢ మతులు, దేహాత్మబుద్ధి వలన, వివేకసూన్యులై, సర్వ కార్యకలాపములు ఆత్మవే యని అనుకొను చుందురు. అనగా దేహమే ఆత్మ అనుకొనుచు దేహము నకు విలక్షణమైనది, నామరూప రహితమైనది, హాది జడసముదాయ ప్రకృతి కంతటికి కారణ భూతమైనటువంటిది యగు ఆత లేదను కొందురు.

## 9

**ఆత్మచైతన మాత**
**దేహేంద్రియ మనోధియః**
**స్వ క్రియార్థేషువర్తన్తే**
**సూర్యాలోకం యథా జనాః ॥**

**తాత్పర్యము :**

సూర్యునినుండి స్వేచ్ఛగా ఉద్భవించెడి వెలుతురు సహాయముతో మనుజులు తమతమ పనులు చేసికొను చుందురు. ఆ ప్రకారమే, శరీరము, ఇంద్రియములు, మనసు, బుద్ధి ఆత్మయొక్క స్వాభావికమైన తెలివి లేక ఎరుక సహాయముతో వాటి వాటి కార్యకలాపములు కొన సాగించుకొనుచున్నవి.

**వివరణ :**

ప్రపంచమంత ప్రాణులు వాటి కార్య కలాపములు కొనసాగించు కొనుటకు సూర్యుని వెలుతురు ఆధారమై యున్నది. జాగ్రదావస్థలో ప్రాణులు వారివారి పనులు చేసుకొనుటకు వెలుతురు ఎట్లు ఆధారమై

యున్నదో, అట్లే ఆత్మ యొక్క ఎరుక లేక తెలివి Consciousness ఆధారముగా శరీరములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మొదలగునవి వాటి వాటి కార్యకలాపములు కొనసాగించుకొను చున్నవని తెలుసుకొనవలెను. సమస్త అనాత్మ సముదాయములనగు శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, ప్రపంచము మున్నగునవన్నియు ఆత్మయందుద్భవించి, ఆత్మవలననే వాటివాటి ప్రవృత్తులలో మనుగడ సాగించి, మరల ఆత్మలో లయమగుచున్నవనునది వేదాంతసారమై యున్నది. ఆత్మస్వరూపుడైన భగవంతుడు ఇట్లు సమస్తమును సృష్టించి, ఆ సృష్టికి భిన్నముగా సూర్యునివలె అంతటా వెలుగుచుండును. ఆ వెలుగువలననే అవ్యక్తముగానుండు ప్రకృతి, ప్రపంచముగా ప్రకటితమై సాగుచున్నది. ప్రపంచములో వ్యక్తమగుచున్న సర్వశక్తులను, భ్రమచేత ఇవన్నీ ప్రకృతి శక్తులని భావించుచుందురు. కాని, నిజానికి వీటన్నిటికీ చైతన్యమిచ్చునది సర్వత్రా వ్యాపించియున్న పరమాత్మ స్వరూపుడగు భగవంతుని మహిమయే. సృష్టి, స్థితి, లయములకు సహజమైన కారణములుగా, భ్రాంతి వలన ప్రపంచమందు ఏవేవో గోచరించుచున్ననూ, వాటన్నిటి వెనుకనూ వున్న మూలశక్తి నిజమైన ఆది పురుషుడు భగవంతు , అని శ్వేతాశ్వతరోపనిషత్తు నందు విశదీకరింపబడినది.

దేహేంద్రియగుణాన్ కర్మా
ణ్యమలే సచ్చిదాత్మని
అధ్యస్యన్త్య వివేకేన
గగనే నీలతాదివత్ ॥

తాత్పర్యము :

నీలి వర్ణముతో నున్నదని, ఒంపు తిరిగి ఒంకరగా నున్నదని, ఆకాశమునకు మానవులు లక్షణములను కల్పించు చుందురు. ఆ ప్రకారమే మూఢమానవులు, అవివేకమువలన శరీరము, మనస్సుయొక్క స్వాభావిక కార్యకలాపములు, సత్‌చిత్ స్వరూపుడై, అవికారుడైన సుద్ధస్వరూపుడగు ఆత్మయందారోపించుచున్నారు.

వివరణ :

నిత్య శుద్ధమై, నామరూప రహితమై, నిశ్చలముగా నుండు ఆత్మ, శరీర మనస్సులతో తాదాత్మ్యము నొందుట వలన, వాటి కార్యకలాపములు ఆత్మయందు ఆరోపింపబడు చున్నవనీ, దినికి ఉపమానముగా ఆకాశమును గురించి మానవులనుకొను విషయములను గుర్తుచేయుచున్నారు. అనంతము, అపరిమితము, స్వచ్ఛము అగు ఆకాశమును చూచుచూ, అది నీలి వర్ణము లేక నల్లని రంగు గలదనీ, వంకరగా నున్నదనీ మానవులు భ్రమపడు చుందురు. కాని అది నిజము కాదు కదా! అట్టి లక్షణము లేవి ఆకాశము నకు లేవు. ఈ ప్రకారమే, ఆత్మ నిర్వికార నిరాకార నిత్య శుద్ధ సత్య స్వరూపుడై భాసిల్లు చున్ననూ, అవివేకము వలన మూఢులు శరీర మానసిక కార్య కలాపములన్నియు, ఆత్మవే నని అపోహ పడుచుందురు.

అజ్ఞానాన్మానసోపాధేః
కర్తృత్వాదీని చాత్మని
కల్ప్యంతేమ్బుగతే చన్ద్రే
చలనాది రథామ్భసః ॥

తాత్పర్యము :

కదులుచున్న నీటియొక్క కదలిక అజ్ఞానమువలన ఆ నీటిలో ప్రతిబింబితుడైన చంద్రునియందెట్లు ఆరోపింపబడుచున్నదో, అట్లే మనస్సుకు సంబంధితములగు కర్తృత్వభోగ్యతలు తదితర పరిమితులు 'హద్దులు' ఆత్మయందు అవివేకమువలన ఆరోపింపబడుచున్నవి.

వివరణ :

ఆత్మ అసంగుడు. అనంతుడు. నిరాకార నిశ్చల స్వరూపుడు, నిష్క్రియుడు. ఇంద్రియముల ప్రేరణ మనస్సు చలించుచుండుట వలన, మనస్సునందు ప్రతిబింబితుడగు ఆత్మయే చలించుచున్నదని అపోహ కలుగుచుండును నీటియందు ప్రతిబింబించిన చంద్రుడు, నీరు కదలుచున్న, తానును కదలుచున్నట్లు అగుపడు చుండును. దీని- ఆదిశంకరులు "స్వప్నస్మృతి" లో ఈ విధముగా చెప్పినారు:

ప్రాణానుకార్యాత్తా ఛాయేవాత్మాది గోచరః
ధ్యాయతీ చోక్తోహి షడ్భోముక్తః స్వతోహిసః॥

అనగా ఆత్మకు ఉపాధియగు బుద్ధియందు, ఆత్మ ప్రతిబింబించుట వలన జీవత్వమను భ్రాంతికిలోనై ఈ జీవభ్రాంతి జనితములగు మనోవికారములైన కర్మములు - యుచున్నట్లు తోచుచుండును. నిజముగా ఆత్మకు ఎట్టి కర్మ కర్తృత్వాదికములు లేవు. అవన్నియు మనస్సునందావిర్భవించెడి సంకల్ప వికల్పములు. అది ఎట్లన, నీటియందు ప్రతిఫలించిన సూర్యుడు, గాలి వలన నీరు కదులుచుండగా, నీటి యందలి సూర్యుని ప్రతిబింబము కూడా కదలు చున్నట్లు గోచరించుచుండును. కాని నిజముగా సూర్యున కెట్టి కంపనములు గాని చలనము గాని లేవు గదా!

ఆత్మ క్రియాశక్తి గలిగిన ప్రాణమునకు, జ్ఞాన శక్తి గలిగిన మనస్సునకు అతీతుడు. నిస్సంగుడై సకల కార్యకలాపములకు సాక్షీమాత్రుడు.

దివ్యో హ్యమూర్తః పురుషః
సబాహ్యాభ్యంతరో హ్యజః।
అప్రాణో హ్యమనాః శుభ్రో
హ్యక్షరాత్ పరతః పరః॥ (ముండకోపనిషత్)

అనగా, స్వయం ప్రకాశము, ఆకారరహితము, నిత్యశుద్ధము, సర్వాధారము అయిన ఆత్మ అంతటను, లోపల వెలుపల కూడా వ్యాపించియున్నది. ఆ పరతత్త్వమగు ఆత్మ జడసముదాయములగు సర్వప్రపంచాదులకు, ప్రాణ మనస్సులకు, అతీతమైనది. అనగా వీటన్నింటి విలక్షణమైనది.

**రాగేచ్ఛాసుఖ దుఃఖాది**
**బుద్ధౌ సత్యాం ప్రవర్తతే**
**సుషుప్తౌ నాస్తి తన్నాశే**
**తస్మాద్ బుద్ధేస్తు నాత్మనః ॥**

**తాత్పర్యము :**

ఎంతకాలము మనస్సులేక బుద్ధి పని చేయుచుండునో, అంతకాలము బంధము, కోరిక, సుఖము, దుఃఖము, బాధ మున్నగునవి ఉన్నట్లు తెలియబడుచుండును. మనస్సు

పని యని గాఢ నిద సుషుప్తి సమయమందు అవి యేవీ తెలియబడుటలేదు. అందువలన అవన్నియు కేవలము మనస్సునకు సంబంధించినవే కాని ఆత్మ ధర్మములుగావు.

వివరణ :

మనస్సు పంచేంద్రియ కూటమితో కూడినదై మనోమయ కోశ మనబడుచున్నది. మనోవిజృంభణమే, దేహాత్మ భావమునకు, సకల కర్తృత్వ, భోక్తృత్వ, భావములకు కారణము. పంచేంద్రియముల ద్వారా జరుగు మనో వ్యాపారమే ప్రాపంచికస్మృతి. అనగా, జాగదావస్థ యందు మనుజులు మనస్సునకు వశులై, విషయ వాననలలో చిక్కుకొని, మనస్సు కల్పించు దేహాత్మ భావము వలనను, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల వల్లను, జనియించు సకల ప్రాపంచిక విషయజాతము, రాగ ద్వేషములు, క్షుత్పిపాసలు, మొదలగు సర్వ కార్యములు, తమవే యను కొనుచూ, తమ యదార్ధ స్వరూపమునకు విరుద్ధమైన స్థితిలో నుండుట జరుగుచున్నది. మనస్సు వలన మన సహజ స్వరూపమగు నిశ్చల చైతన్య స్వరూపము మరుగగుచున్నది. అనిశ్చలతకు మూలము మనో విజృంభణమే. జాగత్ స్వప్నావస్థల యందు మనస్సు విజృంభించుచు మనకు కర్తృత్వ భోక్తృత్వ భావములను కల్పించుచున్నది. సుషుప్తి యందు మనస్సు మనలోలీనమై లయమగు చున్నది. అందు కర్తృత్వ భోక్తృత్వ భావములు సుషుప్తిలో మనకు ఉండవు. మనకు కలుగుచున్న కర్తృత్వ భోక్తృత్వభావము జాగత్ స్వప్నావస్థలలో మనస్సు కల్పించు భ్రాంతి కార్యకలాపమే కాని యదార్ధము కాదనుట తేట తెల్లమగుచున్నది.

తాను జడ స్వరూపమగు శరీరము గాదని. తన నిజస్వరూపము నిరాకార, నిర్వికారమగు ఆత్మ స్వరూపమని, వివేచనవలన గ్రహించు కొని, తనకు నిజముగా బంధమోక్షములు లేవని తెలుసుకొనుటయే

వివేకము. బంధము, కోరికలు, సుఖదుఃఖములు, రాగ ద్వేషములు, మున్నగు సర్వ ద్వంద్వములన్నియు మనో కల్పితములే. వివేక దృష్టిలో నిజముగా లేనివే. మనసే మిథ్యయైనపుడు, మనోకల్పితములు యదార్థము లెట్లగును. మనసెప్పుడు పనిచేయుచుండునో, అపుడే ఇవన్నియు మనలను ఆవేశించు చుండును. మనసు పనిచేయక లయించియుండు నిద్రాసమయములో, అవియేవీ మనకు తెలియబడుటలేదు. కనుక అన్నింటికీ కారణము మనస్సే కాని అవియేవి ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మ ఎల్లప్పుడూ నిస్సంగుడే. రాగద్వేషములు, సుఖ దుఃఖములు, సంసారము, జరామరణములు, క్షుత్పిపాసలు, ఇట్టి ద్వంద్వములేవీ ఆత్మకు లేవు. ఆత్మ స్వరూపము నిష్క్రియము, పరిశుద్ధము, ఆకాశమువలె అఖండము, ఏకము ఆద్యంత రహితము.

## 23

ప్రకాశో௨ర్కస్యతో యస
శైత్య మగ్నేర యథోష్ణతా
స్వభావః సచ్చిదానంద
నిత్య నిర్మలతాత్మనః ॥

**తాత్పర్యము :**

సూర్యుని స్వభావము ప్రకాశమానమైనట్లు, నీటి స్వభావము చల్లదనమైనట్లు, అగ్ని స్వభావము వేడియైనట్లు, ఆత్మయొక్క స్వభావము అనంతము, పవిత్రము, యదార్థము, ఎరుక, లేక సర్వసాక్షిత్వము, ఆనందమయమునై యున్నది.

**వివరణ :**

ఆత స్వభావ మెట్టిదో దృష్టాంత పూర్వకముగా ఈ శ్లోకమందు విశధ పరచినారు. పకాశించుట సూర్యుని స్వభావము. చల్లగానుండుట నీటి స్వభావము. డి, నిప్పు లేక అగ్ని యొక్క రీతి. సూర్యుడు, జలము, అగ్ని వాటి వాటి స్వభావముల నెట్లు కలిగి యున్నవో, అట్లే ఆత్మ యొక్క స్వభావము అనంతము, ప తము, య దార్థమ నై, ఎరుకలేక సర్వ సాక్షిత్వము గలిగి ఆనందమయమై వెలయుచుండును. ఆత్మ స్వరూపము అనేక ఉపనిషత్తులలోను, ఆదిశంకరుల వివేకచూడామణి తదిర ఆధ్యా క గంధములలోనూ విపు ముగా వివరింపబడినది:

యుంజ మన ఉత యుంజ ధియో
వి పా వి పస్య బృహతో విపశ్చితః।
విహో తా ద వయునా విదేక
ఇన్మహీ వశ్య సవితుః పరిష్టుతిః॥

(శ్వేతాశ్వతరోపనిషత్తు)

సర్వాంతరా మి యగు ఆత , సర్వవ్యాపకుడు. ఆయనలేని చోటులేదు. సర్వజ్ఞుడు. ఆయనకు తెలియనిది లేదు. స్వయం జ్యోతిః స్వరూపుడు. తాను పకాశించుచు సర్వమునూ పకాశింప యువాడు. అనంతడు. అనగా ఆద్యంతములు లేనివాడు. ఇట్టి మహా వైభవోపేతుడగు ఆత స్వరూపుని, తపో ధ్యానాది ఆధ్యాత్మిక సాధనల ద్వారా, మనోబుద్ధి పవృత్తులను అరికట్టిన ముముక్షువులు సాక్షాత్కరించు కొందురు.

ఆకాశ వన్నిర ల నిర్వికల్ప
ని సీమ నిస్పందన నిర్వికారం
అ న్తర్బహిః శూన్య మనన్యమద్వయం
స్వయంపరం బహ్మ కిమ స్తి బోధ్యమ్॥

(వివేకచూడామణి)

ఆకాశమువలె నిర్మలమైనవాడు, ఎట్టి సంకల్ప వికల్పములు లేనివాడు, అనంతమైనవాడు ఎట్టికర్మలు, కార్యకలాపములు లేనివాడు, నిర్వికారుడు, బాహ్యాభ్యంతర సూక్ష్ముడు, అద్వి యుడు అగు ఆ పరమాత్మ స్వరూపుడవు నీవే. ఇంక నీకు బోధించెడి దేమికలదు? అని శిష్యునకు ఆత్మ తత్వమును గురువు చెప్పుచున్నాడు.

ఆత్మనః సచ్చిదంశశ్చ
బుద్ధేర్వృత్తిరితి ద్వయం
సంయోజ్య చా వివేకేన
జానామీతి ప్రవర్తతే ॥

**తాత్పర్యము :**

అవివేకమువలన ఒక విధమైన మార్పు చెందిన మనస్సు, ఆత్మ యొక్క రెండు స్వభావములగు సత్ (ఉండుట లేక ఉనికి లేక స్థితి), మరియు చిత్ (తెలివిలేక ఎరుక)తో తాదాత్మ్యము నొందుటవలన "నను తెలుసు కొనుచున్నాను" అను భావము పుట్టుచున్నది.

**వివరణ :**

ఉన్నది ఆత యొక్కటే రెండవ దేదీలేదు. ఇదియే అద్వైత సిద్ధాంత సారము. ఈ సిద్ధాంతమును అవగాహన చేసికొని అనుభూతిని పొందుటయే తత్వసిద్ధి. అజ్ఞానము వలన ఏకత్వ సత్స్వభావుడైన ఆత్మలో చిద్భావము దయించుటతో, "నేను" అను అహంకార భావము

జనించి, " నుచేయుచున్నాను" (అహం కర్తా), " నుభుజించుచున్నాను" (అహం భోక్తా) అను అసత్యపు భావ భ్రమలు బయలుదేరుచున్నవి. ఈ భావ భ్రమలకు, నిరాకార, నిర్వికార, సత్‌చిదానంద స్వరూపమగు ఆత్మలో, "నేను నేను" ను అహంకార భావము దయించుటయే కారణమై యున్నది.

ఈ అహంకారమెట్లు పుట్టు చున్నది? దీనికి సృష్టికర్త ఎవరు? ఇది నిజముగా ఉన్నది యేనా? ఈ అహంకార ప్రకృతి అతి విచిత్రమైనది." "నేను నేను" అని భాసించు అహంకారము నిజముగా శరీరమునకు చెందినది కాదు. ఇది కొద్దిపాటి వివేచన వలన విదితము కాగలదు. ఏలయన, దేహము కేవలము జడ పదార్థదాయకము. పాదములు మొదలు శిరస్సు పర్యంతము అన్వేషించి చూచిన, చర్మము, మాంసము, రక్తము, ఎముకలు, నరములు, మున్నగు జడ పదార్థములే తప్ప "నేను" అనునది గోచరించదు. అట్టి శరీరమునకు అహంకార బుద్ధి యుండుట అసంభవము. ఆత్మ, నిర్వికార, నామరూప రహితమగు అనంత చైతన స్వరూపము. నామ రూపములు లేక, ఆకాశము వలె శూన్యమై సర్వమునూ తనయందు కలిగినదై వెలయు సత్యస్వరూపమగు ఆత్మకు " నూ" అను తలంపు గలుగుటకు అవకాశమేలేదు. ఏలయన, దానికి ఒక ఉనికి యనునది లేదు కదా! అటు శరీరమునకు, ఇటు ఆత్మ స్వరూపమునకు సంబంధించనిదైన ఈ అహంకారము (పరిమిత భావము) అవాంతరముగ తోచుచున్నది. వివేచనా విమర్శనల వలన, ఇది కేవలము భ్రాంతియే కాని యదార్థము కాదని గుర్తించుకొనవచ్చును. ఈ భ్రాంతి ఒకరకమైన స్వప్నము వంటిది. నిరంతర సాధనచే, ఈ భ్రాంతి తొలగించు కొనినచో, మనము మన సహజ స్వరూప దివ్యత్వములో భాసించుచుందుము.

## 5

**ఆత్మనో విక్రియానాస్తి**
**బుద్ధేర్బోధోన జాత్వితి**
**జీవః సర్వమలం జ్ఞాత్వా**
**జ్ఞాతా ద్రష్టేతి ముహ్యతి ॥**

**తాత్పర్యము :**

ఆత్మ ఎన్నడూ ఎట్టి మార్పు చెందునదిగాదు. జడమగు బుద్ధికి సత్తాస్ఫూర్తులు ఎరుక ఎన్నడును ఉండజాలదు. కాని మానవుడు ఆత్మయే బుద్ధియని నమ్ముచు, తాను చూచెడివాడనని, తెలిసికొను వాడనని భ్రాంతిజనితమగు, మాయలో చిక్కుకొనుచున్నాడు.

**వివరణ :**

సర్వ అనర్థములకూ మూలము అహంకారము. ఈ అహంకారము అజ్ఞానము లేక అవిద్య వలన పుట్టు చున్నది. మాయయే అజ్ఞానము, అవిద్య, ప్రకృతిశక్తి అని రకరకములుగా వర్ణించ బడుచున్నది. సత్యమైనదానిని అసత్యముగను, అసత్యమైనదానిని సత్యముగను తోప జేయు అనిర్వచనీయ శక్తియే మాయ అనబడుచున్నది. ఇది భ్రాంతికి సృష్టికర్త.

ఆత్మ నిరాకార నిర్వికార అనంతమయుడు. ఎట్టి మార్పులు ఎప్పుడూ ఆత్మకు ఉండవు. శంకరభగవత్పాదులు, వేరు గ్రంథములో ఈ విషయమునే ఇట్లు విశదీకరించిరి :-

ప్రతి పదమహమాదయో విభిన్నాః
క్షణపరి ణామితయా వికారిణస్తే
నపరిణతి రముష్య నిష్కళత్వాత్
అయమపికాకి తయైవ నిత్యఆత్మా॥

అంతఃకరణ చతుష్టయ మనబడు, మనోబుద్ధి చిత్తాహంకారములు, ఎల్లప్పుడునూ మార్పుచెందు చుండును. ఏలయన అవి యన్నియు, ఆత్మ యందు ఉద్భవించుచు, ఆత్మవలన అ.క మార్పులు జెందుచు, మరల ఆత్మలోనే లయించుచుండును. ఆత్మ నిరవయవుడు. ఏ విధములగు మార్పులూలేని నిస్తరంగ సము ద్రమువలె నిత్య స్వరూపుడై ఎల్లప్పుడు వెలయుచుండును.

ఆయాతాసు గతాసు శైశవ ముఖావస్థాసు జా గను ఖా
స్వనా స్వప్నఖిలాసు వృత్తిషుధియో దుష్టాస్వ దుష్టాస్వపి॥
గంగా భంగ పరం పరాసు జలవత్సత్తాను వృత్తాత్మనః
తిష్ఠ న్నేన సదాస్థిరాఽహమ హమి త్యకాఽత తాసాక్షిణః॥

అనేక తరంగములు గంగానది యందుద్భవించుచు మరల గంగ యం లయించుచున్నవి. గంగానది యందలి జలము మా త్రము ఎల్లప్పుడు యధా ప్రకారముగా ఉంటూ యున్నది. ఈ తరంగము లుద్భవించుటకు, వాయువు కారణమగుచున్నది. అట్లే, అజ్ఞానము వలన నిర్వికారుడగు ఆత్మయందు, స్థూలశరీర ధర్మములగు జరామరణములు, బాల్య, యౌవన, కౌమార్య, వృద్ధాప్యావస్థలును, సూక్ష్మశరీర ధర్మములగు జాగ్రత్, స్వప్న, సుషుప్త్యావస్థలు, రాగద్వేషములు, అహంకార మమకారములు, మంచి, చెడు, పుణ్యము, పాపము మున్నగు అనేక విధములగు మార్పులు, అవస్థలు, భావములు ఉద్భవించుచు, మరల అవన్నియూ ఆత్మ యందే లయించి పోవుచున్నవి. కాని ఆత్మ నిర్వికారుడై ఎట్టి మార్పులూ లేక సుస్థిరముగా ఎల్లకాలము, అన్నింటికీ సాక్షీమాత్రుడై వెలయుచుండును.

ఆత్మ ఆకాశమువలె అసంగుడు. నిర్వికారుడు. రాగేచ్ఛా సుఖ దుఃఖాదులు, కర్తృత్వ భోక్తృత్వములు మున్నగున వన్నీ అంతఃకరణ ధర్మములు. ఆత్మజడమగు అంతఃకరణముతో తాదాత్మ్యము నొందుట వలన అంతఃకరణ ధర్మములగు రాగేచ్ఛా సుఖ దుఃఖాదులు ఆత్మయం దారోపింప బడుచున్నవేగాని, యదార్థముగా ఇవియేవీ ఆత్మ ధర్మములు గావు.

## 6

రజ్జు సర్పవదాత్మానం
జీవో జ్ఞాత్వాభయం వహేత్ ।
నాహం జీవః పరాత్మేతి
జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్ ॥

**తాత్పర్యము :**

మనిషి తాడును చూచి అది పాము అనుకొని భయము చెందు విధమున, ఆత్మను జీవుడననుకొను చుండుట వలన భయమునకు లోనగుచున్నాడు. తాను నిజముగా జీవుడనుగానని పరమాత్మ స్వరూపుడ నేనని తెలిసికొనుట వలన అభయత్వమును తిరిగి పొందుచున్నాడు.

**వివరణ :**

అజ్ఞానము వలన ఉత్పన్నమైన హాని బుద్ధిని, రజ్జు సర్ప న్యాయముతో విశదీకరించుచున్నారు. దేహమే ఆత్మ యనుకొను భ్రాంతి, చీకటిలో తాడును చూచి పాము అనుకొని భయపడుట వంటిది. ఎంత

కాలము తాడుయొక్క యదార్థ స్థితి తెలియక, అదిపామేనని అపోహ పడుచుందుమో, అంతకాలము భయము వదలక పీడించుచుండును. అది నిజముగా పాముకాదు, వట్టి తాడు మా త్రమే నని, దీపము సహాయముతో తెలిసికొన్న మరుక్షణము లో భయమెల్ల పటాపంచలగును. భ్రాంతియు, సర్పమును లేనివై తాడు మా త్రమే నిలుచును. మనుస్సు తెరిపినపడి, సంతోషముతో వెలయును. అట్లే, ఎంతకాలము అజ్ఞానమనెడి భ్రాంతి వలన, శరీరమే తాను (ఆత్మ) అనుకొను అపోహతో నుండునో, అంత కాలము భయము గలిగి యుండును. ఈ భయమునకు కారణము, శరీర ధర్మములగు షడ్భావవికారములును (అనగా, పుట్టుట, పెరుగుట, ఉండుట, పండుట, తరుగుట, నశించుట), కుల, మత, వర్ణాశ్రమాది సాంఘిక నియమములును, అనేక రోగముల బాధలు, దుఃఖానుభవములు, ఇతరులచే గలుగు నిందాస్తుతులు మున్నగునవన్నియూ, తనవేనని అపోహలో నుండుటయే. ఈ అపోహకు మూలము అవిద్య లేక అజ్ఞానము. అవిద్యను ఆదిశంకరులు, ఉపదేశ సాహస్రిలో చక్కగా వివరించారు :

"త్వం పరమాత్మానం సన్తం అసంసారిణం సంసార్యహమస్మీతి విపరీతం ప్రతిపద్యసే; అకర్తారం సన్తం కర్తేతి; అభోక్తారం సన్తం భోక్తేతి; విద్యమానంచా విద మానమితి ఇయమవిద్యా.

పరిపూర్ణుడవై యున్నను, పరిచ్ఛిన్నునిగను, అసంసారివై యున్నను, సంసారివిగను, అకర్తవై యున్ననూ, కర్తవిగను, అభోక్తవై యున్నను భోక్తవుగను, నిత్యుడవై యున్ననూ, అనిత్యునిగను, ఏది నిన్ను భ్రమింప జేయుచున్నదో అదియే అవిద్యలేక అజ్ఞానము. జ్ఞానము వలన ఈ భ్రమ తొలగించుకొని నీయదార్థ స్వరూపమగు ఆత్మను తెలిసికొనుటయే విద్య.

జ్ఞానోత్పత్తి వలన, తాను జడమయమగు శరీరమును గానని, తాను యదార్థముగా నామరూప రహితమైన ఆత్మ స్వరూపుడై వెలయు

చున్నాడని, ఎప్పుడు తెలుసుకొను చున్నాడో, మరుక్షణము నుండి తనకు కలిగిన సర్వభయములు తొలగి, అభయత్వమును పొందు చున్నాడు. ఆత్మ అవినాశి. అవినాశికి భయ కారణ మెంత మాత్రము ఉండుటకు తావులేదు. భ్రాంతిచే ఆత్మయందు తోచు ప్రపంచాదులన్నియూ, ఆత్మ స్వరూపమే యని తెలియుటతో ప్రపంచాదులు అసత్యములై ఆత్మ ~~స్వరూపమే యగును~~

ఈ విషయము ఆదిశంకరులు మరియొక చోట వివరించిన శ్లోకమును కూడ క్రింద చేకూర్చబడినది :-

రజ్జో స్స్వరూపాదిగ మేన సర్పధీః
రజ్జ్వాం విలీనాతు యథాక్రమైవ
బ్రహ్మో ఉపగత్యాతు జగత్ప్రతీతిః
తత్రైవ లీనాతు సహ క్రమేణ ॥

అజ్ఞానము వలన తాడు యందు కలిగిన సర్ప భ్రాంతి తాటి యొక్క యదార్థము తెలిసిన వెంటనే, తాటియందు లయించుచున్నది. పాము పోయి తా కనబడుచున్నది. ఆ ప్రకారమే అజ్ఞానము వలన బ్రహ్మమందు కల్పించబడిన విశ్వమంతయు, బ్రహ్మజ్ఞాన ముదయించిన వెంటనే, దాని వికృతమైన నామరూప మాయా స్వరూపము విసర్జించి బ్రహ్మస్వరూపమందు లయించుచున్నది.

## 2

ఆత్మైవ భాసయత్యేకో
బుద్ధ్యాదీనీన్ద్రియాణి చ
దీపో ఘటాదివత్ స్వాత్మా
జడైస్తైర్నావ భాస్యతే ॥

**తాత్పర్యము :**

ఒక జాగాని కుండగాని దీపమువలన ప్రకాశింప బడునట్లు, మనస్సు, ఇంద్రియ కూటము మొదలైనవి ఆత్మ వల్లనే ప్రకాసింపబడుచున్నవి. కాని ఈ భౌతిక పదార్థ జాతములు వాటంతట అవి ప్రకాశమానములు కాజాలవు.

**వివరణ :**

భౌతిక వస్తుజాతమంతయూ జడసముదాయము. స్వయముగా వాటికి సత్తా స్ఫూర్తులు లేవు. అనగా, ప్రపంచములో కానవచ్చు సకల పదార్థములు (ఉ॥ కుండ, జా మొదలైనవి) దీపము వలన, లేక సూర్యుని వెలుతురు వలన ప్రకాశవంతము లగు చున్నవి కాని, అవి స్వయముగా ప్రకాశించు స్వభావము కలవి గావు. అట్లే, ప్రపంచము, శరీరము, ఇంద్రియములు, మనస్సు మొదలగునవన్నీ వాటంతట అవి ప్రకాశ మానములు గావు. అవన్నీ ఆత్మవలన ఉత్పన్నమై, ఆత్మ వల్లనే భాసింపబడుచున్నవి. చివరకు ఆత్మలో లయించుచున్నవి.

నోపనిషత్తు నందు ఈ విషయము ఎంతో వివరముగా తెలుపబడినది :

శ్రో తస్య శ్రో త్రం మనసో మనోయద్
వాచోహ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః
చక్షుషశ్చ క్షురతి ముచ్య ధీరాః
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవన్తి

అనగా, ఆత్మశక్తి చేత, చెవులు వినగలుగు చున్నవి. కళ్ళు చూడగలుగు చున్నవి. నోరు మాట్లాడ గలుగు చున్నది. మనస్సు సంకల్పించ గలుగు చున్నది. ప్రాణములు శరీరములో పని చేయ గలుగు చున్నవి. జడ సముదాయములగు ఇంద్రియాలకు, మనస్సుకు, ప్రాణములకూ ఆత్మ స్వయంగా విలక్షణుడని విచక్షణా జ్ఞానముచే తెలుసు కొనిన బుద్ధిమంతుడు, అజ్ఞానపు మాలిన్యము వదలినవాడై తన నిజస్వరూపమగు ఆత్మను గుర్తించుకొని అమరుడౌతాడు.

దేనిని మనస్సు గ్రహించలేదో, అయినను దేని చేత మనస్సు సర్వమునూ గ్రహించుచున్నదో, దేనిని దృష్టి చూడలేదో కాని దేనిచేత చక్షువులకు దృష్టి కలుగుచున్నదో, దేనిని చెవులు వినలేవో అయినను దేనిచేత చెవులకు వినికిడి శక్తి కలుగుచున్నదో, దేనిని ఘ్రాణేంద్రియము నాసిక వాసన చూడజాలదో, కాని దేనివలన దానికి వాసన చూచు ప్రవృత్తి కలిగినదో అదియే బ్రహ్మస్వరూపమని కేనోపనిషత్తునందు వివరింపబడినది.

స్వబోధే నాన బోధేచ్ఛా
బోధరూప తయాత్మనః ।
నదీపస్యా న్యదీపేచ్ఛా
యథాస్వాత్మ ప్రకాశతే ॥

**తాత్పర్యము :**

వెలిగించిన దీపము యొక్క కాంతిని ప్రకటించుటకు ఇంకొక దీపము ఎట్లవసరములేదో, అట్లే స్వయం ప్రకాశ మానమగు ఆత్మను ప్రకాశవంతము చేయుటకు వేరే ప్రకాశిక పరికర మేదీ అవసరము లేదు.

**వివరణ :**

ఆత్మ స్వయం ప్రకాశము. చిత్‌జ్యోతి. వెలిగించిన దీపము వంటిది. వెలిగించిన దీపము యొక్క కాంతిని తెలిసి కొనుటకు వేరొక సహాయము అవసరము లేదు. ఆత్మ ప్రకటితమైన మరుక్షణముననే అజ్ఞానాంధకార మంతయూ పటాపంచలై ఆత్మ మాత్రమే ప్రకాశించు చుండును. ఆ ఆత్మ జ్యోతియే మన యదార్థ స్వరూపము. దానిని ప్రకాశవంతము చేయుటకు ఇక వేరేదియునూ ఉండుట కవకాశము లేదు. ఆత్మానుభూతి పొందిన తదుపరి ఉన్నది ఆత్మానుభవమొకటే. వేరు వస్తువేదీ యుండదు. అన్నీ ఆత్మానుభూతిలో లయి చును.

ఆత్మ చిత్ప్రకాశము. ఎల్లప్పుడూ నిత్యమై, జ్ఞానస్వరూపమై, నిరపేక్షసక్తమై ప్రకాశించుచుండు ఆత్మకు రాకపోకలు లేవు. అనగా ఒకప్పుడు ప్రకాశించుట, మరియొకప్పు ప్రకాశింపక పోవుట, అనునవి లేవు. ఇట్లు నిత్య ప్రకాశ స్వరూపుడగు ఆత్మకు ఒకప్పుడు జ్ఞానము వేరొకప్పుడు అజ్ఞానము లేదు. ఆత్మయొక్క ప్రకాశకత్వమును ఆది శంకరులు వేరొక గ్రంథమందీవిధముగా వివరించిరి:-

స్వభాసనేవాన్య పదార్థ భాసనే
నాఽర్కః ప్రకాశాన్తర మీక్షదిచ్ఛతి ।
స్వబోధ, వాఽప్యహమాది బోధనే
తదైవ ఓద్ధాతు రయం పరాత్మా ॥

అనగా, తాను స్వయముగా ప్రకాశించుటకును, ప్రపంచమందలి పదార్థము లన్నిటిని ప్రకాశవంతములుగా చేయుటకును, సూర్యునకు మరియొక ప్రకాశవస్తువు సహాయము అవసరము లేదు. అట్లే స్వయం ప్రకాశ స్వరూపుడగు ఆత్మ, తాను ప్రకాశించుటకు గాని తనకు విలక్షణమైన సకల జడసముదాయములూనగు శరీరము, మనస్సు, ఇంద్రియములు, బుద్ధి మున్నగు వానిని ప్రకాశింప యుటకు (అనగా చైతన్యవంతములుగా చేయుటకు) గాని, వేరెట్టి ప్రకాశ పరికరమూ అవసరములేదు.

అన్య ప్రకాశం నకిమప్య పేక్ష్య
యతోఽయ మాభాతి నిజాత్మనైవ
తతస్స్వయం జ్యోతి రయం చిదాత్మా
నహ్యాత్మభా పరదీప్య పేక్షా॥

అనగా, సూర్యుడు, అగ్ని మున్నగు ఇతర ప్రకాశముల సహాయము నెంత మాత్రమూ నపేక్షింపక, తనకు తానే అంతటను అన్నిటిని ప్రకాశించుచున్నాడు గనుక, ఆత్మ స్వరూపుని స్వయం జ్యోతి స్వరూపుడని, ఏ పరదీప్త్యపేక్ష లేని వాడని తెలిసికొన వలెను.

శ్వేతా శ్వతరోపనిషత్తు నందును, కఠోపనిషత్తు నందునూ ఈ విషయము ఈ కింది శ్లోకమునందు విపులీకరింపబడినది :-

నతత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః
తమేవ భాంతమను భాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి॥

అతడు ఎంతటి ప్రకాశముగలదో చెప్పుట అసాధ్యము. ఆ బ్రహ్మ ప్రకాశము ముందు సూర్య చంద్ర నక్షత్రాదులు ప్రకాశింపజాలక వెలవెల

పోవును. ఇక అగ్ని ప్రకాశమెక్కడిది? ఆ బ్రహ్మ స్వరూపుని ప్రకాశము వల్ల సూర్యుడు, చంద్రుడు, అగ్నిమున్నగు సర్వమూ భాసించుచున్నవి. గోచరించుచున్న సర్వ ప్రకాశమూ, వెలుగూ ఆయనదే. అన్ని ప్రకాశములు, వెలుగులూ ఆయననుండియే ఉద్భవించుచున్నవి.

## 9

నిషిధ నిఖిలోపాధీన్
నేతినేతీతి వాక్యతః ।
విద్యాదైక్యం మహావాక్యై
ర్జీవాత్మ పరమాత్మనోః ॥

**తాత్పర్యము :**

"ఇదికాదు ఇదికాదు" 'నేతి నేతి' అను స్మృతి సిద్ధాంతము నభ్యసించుచు, శరీరము, ఇంద్రియములు మున్నగు ఉపాధుల నన్నిటిని నిరసించి, జీవాత్మ పరమాత్మలు ఒకటేయని వేదాంత మహాస్మృతుల వల్ల తెలిసికొనుము.

**వివరణ :**

సర్వ వేదాంత సిద్ధాంత సారమునూ, ఈ శ్లోకమందు పొందు పరచినారు. సచ్చిదానంద స్వరూపమైన మన నిజస్వరూపమునకు ఉపాధులే అవరోధములు. భ్రాంతి- కల్పితములైన ఈ అవరోధముల వలన, మన నిజస్వరూపమగు ఆత్మ స్వరూపము, మేఘముల వెనుక సూర్యునివలె, మరుగై యున్నది. ఈయదార్థమును వివేచన- అనుభవ

పూర్వకముగా గుర్తించ కొనుటయే, సక్రమమైన సాధనా మార్గము కాగలదు. ఈ మార్గమును తెలుసుకొనిన సాధకుని, అవరోధనల ఉపాధుల నిర్మూలనమే సాధన మగును. అనగా, అవరోధములను పోగొట్టుకొనుటయే, మన యదార్ధ స్వరూపమైన భగవత్ స్వరూపమును ప్రకటితము చేసికొనుట.

ఉపాధులన్నీ అనాత్మ పదార్ధములు. ఇవియే అజ్ఞానము వలన గోచరించెడి జడ సముదాయములగు లోకము, శరీరము, పంచేంద్రియ కూటమి, అంతఃకరణ చతుష్టయమగు మనః, చిత్త, బుద్ధ్యా హంకారములు. ఇవన్నీ, మిధ్యా జన్యములును, ఆరోపితములును, అనిత్యములును గాని, యదార్ధములు గావని నిశ్చయించుకొని, తదుపరి లోపల వెలుపల అంతటను నిండియుండి, సర్వావస్థలను ప్రకాశింపజేయు చైతన్య స్వరూపమగు బ్రహ్మము నునేనే యని అనుభూతి చెందుటయే సర్వోత్కృష్టమైన ఆధ్యాత్మిక సాధనము. అట్టి అనుభూతి కలుగుటకు, అవరోధములగు అనాత్మ పదార్థము లేవో వాటినన్నింటినీ, వాటి యదార్ధ మిధ్యా స్వరూపమును తెలుసుకొని వాటిని విడనాడవలెను కదా! అద్వితీయము, అనంతమునగు బ్రహ్మ స్వరూపమే సర్వత్రా సర్వదా భాసించుచున్ననూ, అజ్ఞాన కల్పితములగు అవరోధముల వలన అది మరుగైయున్నది. కనుక, సర్వసాధనలు ఈ అరిష్టదాయకమగు అవరోధములను పోగొట్టుకొను నిమిత్తమే కదా!

మనకున్న జ్ఞానము రెండు విధములుగా నున్నది. మొదటిది అజ్ఞానము వలన భాసించెడి మిధ్యా జ్ఞానము. ఇదియే అవిద్య. నేను, నాది, నేను చేయుచున్నాను, నేను తినుచున్నాను అనుకొనెడి అహంకార మమకార కర్తృత్వ భావమేదైతే మానవులలో సర్వ సామాన్యముగా భాసించుచుండునో, అదియే, మిధ్యాధారమైన దగుటవలన, మిధ్యా జ్ఞాన

మనబడు చున్నది. ఇక రెండవ జ్ఞానము తత్వమస్యాది మహావాక్యములు బోధించెడి: "బ్రహ్మ స్వరూపుడనై యున్నాను అహం బ్రహ్మాస్మి" యనెడి ఆత్మ జ్ఞానము. ఇవియే ప్రజ్ఞానము. ఈ ప్రజ్ఞానమే బ్రహ్మ స్వరూపమని "ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యము బోధించు చున్నది. ప్రజ్ఞానమే సమ్యక్ జ్ఞానమని కూడ అనబడు చున్నది.

అజ్ఞాన కారణము వలన ఉద్భవించిన, మిథ్యా జ్ఞానమును పోగొట్టు కొనుటయే, ఆత్మాపరోక్షానుభూతి యగుటకు సాధనమై యున్నది. నిరంతరము ఆత్మా నాత్మ వస్తు విచారము వలన, ఆత్మ జ్ఞానమగు సమ్యక్ జ్ఞానము సిద్ధించుననునది శాస్త్ర విదితము. అనగా, అనాత్మ పదార్థ జాతమగు దేహాది దృశ్య ప్రపంచము యొక్క యదార్థ స్వరూపమును పదే పదే శ్రద్ధతో విచారించుట వలన, మిథ్యా జ్ఞానము తొలగి, సమ్యక్ జ్ఞానము సిద్ధించును. మూర్ఖత్వము వదలి దైవత్వము కలుగును.

ఎంతటి బుద్ధిశాలికైనను, అజ్ఞాన జన్యములగు, స్థూల, సూక్ష్మ, కారణ శరీరాది జడ సముదాయములన్నియూ, మిథ్యా భూతములని తాను నిజముగా నామ రూపములు లేని చైతన్య మాత్రుడనని, అనుకొనిన మాత్రమున, ఆత్మ జ్ఞానము కలుగజాలదు. ఏవి అనాత్మ పదార్థములో, అవి యన్నియూ, అనుభవ పూర్వకమగు దృఢవిశ్వాసముతో, మరల మరల మననము చేయుచు, వాటి యదార్థ స్వభావమును, ఘనస్పష్టమైనట్టుకొనునట్లు గుర్తించుకొని, అనుభూతి నొందినవాడై వాటిని విసర్జింపవలెను. ఇట్లు సంతత దృఢాభ్యాసము, ఆత్మస్వరూపము కంటె భిన్నమైన ఆరోపితములగు కల్పిత పదార్థ జాతమంతయూ స్వశరీరముతో సహా "నేను" కానివి గనుక, మిధ్యగా నిరసింపబడగా, మిగులునది స్వస్వరూపమే యగును.

అట్టి మన నిజస్వరూపము, స్వతః సిద్ధము. స్వయం జ్యోతి స్వరూపమునై, ఎల్లెడలా ఎల్లకాలముల యందూ భాసించుచునే యున్నది. అటువంటి మన చిదాత్మ స్వరూపమందు, ఆరోపింపబడిన అనాత్మ సముదాయమగు కర్తృత్వ భోక్తృత్వాది భ్రాంతి భావములనూ, మిథ్యా గోచరములగు జగచ్ఛరీరాదులనూ, " నేతి నేతి" అనగా, ఇది కాదు ఇది కాదు, అని నిషేధించుచూ, చేపట్టబడు మానసిక సాధనయే, ఆత్మా వరోధముల నన్నింటినీ నిర్మూలించగల సర్వోత్కృష్టమైన సాధన. విద్యా బుద్ధులు గల ఏపాటి వివేకవంతులకైనను, ఈ సాధన సులభముగను, అభ్యసించుటకు అనుకూలమైనది గను యుండునని శాస్త్రములు విశదీకరించినవి.

ఆవేషా త్మతిబుద్ధిస్త్వ జ్ఞస్య స్వాభావికం పదమ్
ఉక్తం నేత్యాది వాక్యేన కల్పిత స్యేవ తృణా॥

అనగా ఆరోపితములైన జడ పదార్థములగు దేహేంద్రియ ప్రాణాదులును, అనేక రకముల కర్తృత్వ భోక్తృత్వ భావ పరంపరలతో పాతుకు పోయియున్న దేహాత్మ బుద్ధియు అంత సులువుగా వదలించు కొనుట సాధ్యముకాదు. " నేతి నేతి" మహా వాక్యాధారముగా వాటిని యుక్తితో, వివేక వైరాగ్యములతో విడనాడవలెను. బిగ్గరగా ఎన్నిమార్లు పిలిచిననూ నిద్రించువాడు లేవనందున, వానిని కాలితో తట్టి లేపుట వంటిది "నేతి నేతి" మహా వాక్యాధార సాధన. నిద్రలేచి మెళకువ కలిగినట్లు, సర్వ అనాత్మ పదార్థములనూ విడనాడిన, శేషించిన తాను తన నిర్విశేష, నిజ స్వరూప, చైతన్యానందమై భాసించుచుండును.

అవిద కం శరీరాది
దృశ్యం బుద్బుదవత్ క్షరమ్
ఏతద్ విలక్షణం విద్యా
దహం బ్రహ్మేతి నిర్మలం ॥

**తాత్పర్యము :**

అవిద్య వలన కల్పింపబడిన ఈ శరీరము మున్నగునవి జడ స్వభావమైనవై నీటిపైన బుడగలవలె నశించి పోవుచుండును. అట్టి వాటికంటె పూర్తిగా విలక్షణుడైన సుద్ధ బ్రహ్మస్వరూపము నీవేనని వివేకము గుర్తించు కొనుము.

**వివరణ :**

ఏదైే యదార్థముగా ఒక వస్తువై యున్నదో, దానిని వేరొక వస్తువనుకొనుటయే అవిద్య. లోకములో ప్రజలు ముత్యపుచిప్పను జూచి వెండి యని భ్రమపడు చుందురు. దూరమునుంచి చీకటిలో మోడును చూచి మనిషి యని అపోహపడు చుందురు. తాడును చూచి పాము అనుకొని భయమునకు లోనగుదురు. వేదాంత పరిభాషలో ఈ మాదిరి ఉపమానములు సర్వసామాన్యముగా చెప్పబడు చుండును. ఇటువంటి అవిద్య లేక అజ్ఞానము వల్ల మన స్వరూపము అవయవ సమూహమై, పరిమితత్వముగల ఈ శరీమని మనము భ్రమపడు చుండుట జరుగు చున్నది. యదార్థముగా మనము పరిపూర్ణ సచ్చిదానంద స్వరూపులమై యున్నాము.

ఆత్మ నామరూపరహితమైనది. కర్తృత్వ భోక్తృత్వములు లేనిది. నిత్యమైనది. అవినాశి ఎట్టి పరిమితత్వములేని అఖండ స్వరూపము. ఇట్టి ఆత్మ స్వరూపమును శరీర మనుకొనుటకు, అవిద్యచే నారోపింపబడిన మిథ్యయే కారణము. తాడును పామనుకొనుట, మోడును నరుడనుకొనుట, ముత్యపు చిప్పను జూచి వెండి యనుకొనుట భ్రమయేకాని సత్యము కాదు కదా! నిత్యానిత్య వస్తువివేకముచే విచారించుకొని, జడస్వరూపములగు ప్రపంచము, శరీర మనోబుద్ధ్యాహంకారములు అనిత్యములని, నీటిబుడగల వలె నశింపునవని. తాను మా తము వాటన్నిటికీ విలక్షణుడై ఎల్లకాలము ఉండు నామరూపరహితమైన ఆత్మ స్వరూపుండని తెలిసికొనుటయే జ్ఞానము. జడస్వరూపములైన ప్రపంచ శరీరాదులన్నియూ అజ్ఞానము వలన ఆత్మయందు కల్పింపబడిన భ్రాంతులేగాని, వానికి యదార్థమైన ఉనికి లేదు. జ్ఞానోదయమైన వెంట అవన్నీ ఆత్మయందు లయించును.

**దేహాన్యత్వాన్న మే జన్మ**
**జరాకార్శ్య లయాదయః**
**శబ్దాది విషయైః సఙ్గో**
**నిరిన్ద్రియతయా న చ ॥**

**తాత్పర్యము :**

నేను శరీరమునకు భిన్నుడను గావున, పుట్టుక, ఎదుగు, వార్థక్యము, చావు మున్నగు మార్పులకు లోను

అ తుడనై యున్నాను. నేను జ్ఞా ం దియములు లేని వాడను గావున, శబ్దము, స్పర్శ, రుచి మున్నగు ఇం ంియ విషయములకు ను సంబంధము లేనివాడను.

**వివరణ :**

బహ్మాత్మైక్య జ్ఞానము సాధకులలో బలపడుటకు, ధ్యానము చేయు విధానమును ఈ శ్లోకములో సాధకుల ను శించుచు వివరింపబడినది. నామ రూపాత్మకమగు శరీరము తాను గానని, యదార్థముగా తాను నామరూప రహితమైన చైతన్యస్వరూపుడనని, ఈ శరీరాది జడ సముదాయమునకు విలక్షణుడనని, సాధకుడు ధ్యానము యవలెను. యదార్థముగా విల క్షించుకొనిన, శరీరము ఈ విధమైనది :-

త్వజ్మాంస రుధిర స్నాయు మేధో మజ్జాస్థిసంకులం,
పూర్ణం మూ త పురీషాభ్యాం స్థూలం నింద్యమిదం వపుః ॥
వివేకచూడామణి

అనగా చర్మము, మాంసము, నరములు రక్తము, మేధస్సు, ఎముకలు మున్నగువానితో యబడి, మలమూ తములతో నిండియుండి ఎంతో హేయ మైనది ఈ స్థూలశరీరము. శరీరము అతి అసహ్యకరమైనదని యీ కింది శ్లోకములో గుర్తింపనగును.

అమిధ్యపూర్ణే కిమిజాత సంకులే
స్వభావ దుర్గంధ విదింతి తాంతరే
కళేబరే మూ తపురీష పూరితే
రమంతి మూఢాః విరమంతి పండితాః ॥

మి సముదాయముతోగల మలమూ తములతో నిండి, స్వభావ ముగా దుర్వాసన గలిగి, అశుద్ధమై, అపవిత్రమైన ఈ మలమూత్ర భాండ

మగు శరీరమును, అవి- కులగు మూఢులు ప్రేమింతురు. వివేకవంతులగు జ్ఞానులు దీనిపట్ల విముఖతతో నుందురు.

పంచభూతములగు పృధివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశముల పంచీకరణముతో నుత్పన్నమగుచు, అహంకారియగు జీవునకు, స్థూలశరీరము భోగసాధన మగుచున్నది. ఈ దేహము పుట్టుట, ఉండుట, పెరుగుట, పండుట, తరుగుట, నశించుట అను ఆరు ధర్మములు కలిగియున్నది. దీనినే షడ్భావ వికారము లందురు. ఇవిగాక కుల, మత, వర్ణాశ్రమాది సాంఘిక నియమములును, అనేక రోగముల బాధల అనుభవములును, ఇతరుల గలుగు నిందాస్తుతులు మున్నగునవన్నియు, స్థూలశరీర ధరములు.

నిరవయము, అశరీరము, నిత్యము, ఆకాశమువలె సర్వవ్యాపియగు ఆత్మకు, జరామరణములు, పెరుగుట, తరుగుట, వార్ధక్యము, నశించుట మున్నగు లక్షణములేవీ ఉండుట కవకాశములేదు. ఎట్టి మార్పులూ లేక, నిస్తరంగ సముద్రమువలె ఎల్లకాలము అంతటా నిండియుండుట ఆత్మయొక్క స్వభావము. కనుక, ఆత్మ శరీరమునకు ఎల్లప్పుడూ విలక్షణము. అట్టి ఆత్మ స్వరూపమే మన నిజస్వరూపమని గుర్తించుకొనుటయే జ్ఞానము.

ఆత్మ ఇంద్రియాతీతుడు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములలెరిగి, జ్ఞానేంద్రియములు, శరీరమునకు సంబంధించినవేగాని ఆత్మ వానికి భిన్నుడు. విలక్షణుడు. ఇంద్రియ వ్యాపారములతో ఆత్మకెట్టి సంబంధము లేదు. అజ్ఞానమువలన, ఇంద్రియ వ్యాపారములన్ని ఆత్మవేయని భ్రమించుచుందుము. పడవ నడచుచుండగా చెట్లు కదలిపోవుచున్నట్లును, నీరు కదలుచుండగా నీటిలోని చంద్రబింబము కదలుచున్నట్లును, ఎట్లు

మూఢులు అపోహపడుచుందురో, అట్లే సర్వశరీరేం దియ కర్మకలాపము-లునూ ఆత్మవేయని అజ్ఞులు భావించుచుందురు.

సాధకుడు ఈ విధముగా ధ్యానించుకోవలెనని సూచింపబడినది: తాను ఘటమువంటి శరీరమును తెలుసుకొనువాడు కాని తానా శరీరము కాడు. అట్లే హేం దియాది సముదాయమును తాను జూచెడివాడు కాని, వాటన్నిటికంటె తాను అన్యుడే. వాటికి తాను ఎల్లప్పుడూ విలక్షణుడు. తాను సుఖదుఃఖాదులకు సాక్షిమాత్రుడై ఉన్నాడు కాని, ఆ సుఖ దుఃఖాదులు తనను అంటవు. అవన్నీ తనచేత తెలియబ విషయ వస్తువులు. తాను తన తెలియబడు వస్తుజాతమెట్లు కాగలడు? అసంభవము. తనకు తెలియబడెడి సమస్త వస్తుజాతము జడమగుము. వాటికి స్వయముగా సత్తాస్ఫూర్తులు లేవు. తన వలననే తన యెరుక లేక (ప్రకాశము Consciousness) వలననే అవన్నియూ ప్రకాశమానములైనవి. తన శక్తి తేజస్సువల్ల అవి భాసించుచు వాటివాటి కార్యకలాపములు సాగించుకొనగలుగుచున్నవి. హేం దియాది కార్యకలాపములకు, సుఖదుఃఖాది అనుభవములకు సాక్షి యగువాడొకడు లేని యడల, అవి తమని తామే చూచుకొనునవి కావలయును. ఇది అసంభవము. మేకు గుచ్చుకొనినపుడు కలుగు నొప్పి మేకునకు తెలియదు. గంధము పూసుకొనినపుడు గలుగు సుఖము గంధమునకు తెలియదు. ఈ సుఖదుఃఖాధులు వానికంటె నన్యుడు, వాటిని తెలిసికొనువాడు నగుజ్ఞాతకే తెలియును. హేం దియాదు లేవీ తమ్ము తామెరుగలేవు. తాను వాటన్నిటికీ అన్యుడై, వాటిని తెలుసుకొనెడి ఆత్మ స్వరూపుడనని సాధకుడు భావించుకొనుచు స్వస్వరూపానుసంధానమనెడి సర్వోత్కృష్టమైన జ్ఞాన స్వరూపధ్యానము సికోవలెనని ఈ శ్లోకమునందు సూచించినారు. ఈ ధ్యానమందు సాధకుడింకను ఇట్లు భావించుకొనవలెను. తన దేహము జనించి, వృద్ధినొందుచూ, బాల్య, యౌవన, కౌమార, వార్ధకావస్థలతో సతతము మార్పులు జెందుచు చివరకు

క్షీణించి నశించిపోవుచున్నవి. కాని తాను మా తము ఈ . హసంబంధమగు సకలావస్థలకూ సాక్షీమాత్రుడై, జననముగాని, వృద్ధిగాని, క్షయముగాని, మరణముగాని లేనివాడై సర్వదా ఎల్లవేళలా వెలయుచున్న జ్ఞానైక్య స్వరూపుడగు హ స్వరూపుడై యున్నాడు. ఇ తన నిజస్వరూపము. సతతము సకలావస్థలయందు తనలో "నేను నేను" అని భాసించుచు మనోబుద్ధి వృత్తుల న్నింటికి సాక్షిగా నుండి, వాటిని గ్రహించుచున్న ఏ చైతన్య స్వరూపమైన హము విలసిల్లియున్నదో, అదే తానై యున్నానని ధ్యానించుకొనవలెను.

అమనస్త్వాన్న మే దుఃఖ
రాగద్వేష భయాదయః
అప్రాణోహ్యమనాః శుభ్ర
ఇత్యాది శ్రుతిశాసనాత్ ॥

**తాత్పర్యము :**

ను మనస్సునకు భిన్నుడను గావున, విచారము, బంధము, ఆపాయ భయములకు అతీతుడనై యున్నాను ఆయన ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు, మనస్సు లేనివాడు, శుద్ధమైనవాడు, ఉత్తమోత్తముడు, నాశరహితుడు అయి వున్నాడని శ్రుతి ఆ శమైయున్నది.

**వివరణ :**

పంచేంద్రియములూ, మనస్సు కలిపి మనోమయ కోశమందురు. అజ్ఞానము వలన జనించుచున్న సకల సంసార బంధములు, కర్తృత్వ

భోక్తృత్వ భావ పరంపరలు, మనస్సు నుండియే పరిణమించుచున్నవి. స్వప్నమందు తోచు సమస్త కల్పితరూప ప్రపంచము సైతమూ, మనస్సు వలననే సృష్టింపబడుచున్నది. దేహాదులయందునూ, విషయ వస్తువుల యందునూ, రాగ ద్వేషములు కలుగుచుండుటకు మనః ప్రవృత్తియే కారణము.

మనః ప్రసూతే విషయానశేషాన్
స్థూలాత్మనా సూక్ష్మతయా చ భోక్తుః
శరీర వర్ణాశ్రమ జాతి భేదాన్
గుణ క్రియా హేతుఫలాని నిత్యమ్ ॥

(వివేకచూడామణి - 179)

మనస్సునకు రెండు రూపములు గలవు. స్థూలరూపము, సూక్ష్మరూపము. జాగ్రదావస్థయందు మనస్సు, స్థూలరూపములో నుండి, స్థూల ప్రపంచము లోని సమస్త విషయములను దర్శించుచు, కర్తృత్వ భోక్తృత్వ భావములను సర్వదా కలుగ చేయుచుండును. స్వప్నావస్థయందు సూక్ష్మరూపముతో స్వప్న ప్రపంచమును కల్పించుచు, అనేక రకముల భయ భ్రాంతులు, అసూయా ద్వేషములు, సుఖదుఃఖములు, బంధములు మొన్నగు అన్యాధ్యాసములు కలుగ చేయుచుండును. యదార్థముగా జ్ఞానదృష్టిలో ఇవేవీ లేవు. మనఃకల్పితమైనవి యదార్థము లెట్లగును? అవన్నీ యదార్థములని మనము అజ్ఞానములో నున్నంతవరకు భ్రమపడుచు యుందుము.

పంచేంద్రియముల ద్వారా జరుగు మనోవ్యాపారమే ప్రపంచ స్మృతికి కారణమైనది. మనోవిజృంభణము వలన, మనకు దేహాత్మ భావము, కర్తృత్వ, భోక్తృత్వ భావములు కలుగుచున్నవి జాగదావస్థ యందు మనము మనస్సునకు వశులమై, విషయ వాసనలలో చిక్కుకొని,

మనస్సు కల్పించు దేహాత భావము వలన శబ్ద, స్పర్శ, రూప, రసగంధ ముల వలన జనియించు సకల ప్రాపంచిక విషయ జాతము, రాగ ద్వేష ములు, క్షుత్పిపాసలు మొదలగు సర్వవికారములు, మన- యనుకొనుచు, మన యదార్థ స్వరూపమునకు విరుద్ధమైన స్థితిలో నుండుట జరుగు చున్నది. మనస్సు వలననే మన సహజస్వరూపమగు నిశ్చల చైతన్య స్వరూపము మరుగగుచున్నది. మనోవిజృంభణమే అనిశ్చలతకు మూలము. జాగత్ స్వప్నావస్థలయందు మనస్సు విజృంభించుచు, మనకు కర్తృత్వ భోక్తృత్వ భావములను కల్పించుచున్నది. సుషుప్తియందు మనస్సు మనలో లీనమై లయమగుచున్నది. అందు కర్తృత్వ భోక్తృత్వ భావ ములు సుషుప్తిలో నుండవు. కాబట్టి మనకు కలుగుచున్న కర్తృత్వ, భోక్తృత్వ భావము జాగత్ స్వప్నావస్థలలో మనస్సు కల్పించు భ్రాంతి కారక కలాపమే కాని యదార్థము కాదనుట టతెల్లమగుచున్నది.

మనస్సు సదా మార్పులు చెందుచు పెరుగుచు, తరుగుచు, సుషుప్తిలో అదృశ్యమగుచు, జడస్వభావముగల దగుట వలన, నిజ స్వరూపమగు ఆత్మకు భిన్నమైనది. బంధము, అహంకారము(?), భయము మున్నగు వికారములన్నియూ మనోకల్పితములేగాని ఆత్మకు వానితో ఎట్టి సంపర్కములేదు. ఆత్మ వీటన్నిటికీ అతీతమైనవాడు. నాశరహితమైన వాడు. సర్వోత్కృష్టమైన సచ్చిదానంద స్వరూపుడు. ఉచ్ఛ్వాసనిశ్వాసము లగు ప్రాణధర్మములు, రాగద్వేషములగు మనోధర్మములు లేక, ఆత పరిశుద్ధమై, సర్వవ్యాపకము సర్వోత్తమమునై ఎల్లెడల, ఎల్లవేళల ప్రకా శించుచుండు స్వభావము గలవాడు.

ఏతస్మాజ్జాయతే ప్రాణో
మనః సర్వేంద్రియాణి చ
ఖం వాయుర్జ్యోతిరాపః
పృథివీ విశ్వస్యధారిణీ ॥

**తాత్పర్యము :**

దాని (బ్రహ్మము) నుండియే ప్రాణము, మనస్సు, సర్వజ్ఞానేంద్రియములు, ఆకాశము, వాయువు, నీరు, భూమి ఉద్భవించినవి. అదియే అన్నిటికి ఆధారమైనది.

**వివరణ :**

"సర్వం ఖల్విదం బ్రహ్మ" - సమస్తమూ బ్రహ్మమే అయి వున్నది. సర్వమునకు ఆధారమైనది బ్రహ్మమే. మిథ్యాస్వరూపములైన శరీరము, ప్రాణము, మనస్సు, జ్ఞానేంద్రియ పంచకము, పంచభూతము లగు ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, భూమి, పంచభూత సమ్మేళన మగు ప్రపంచము సమస్తమూ ఆత్మ నుండి జనించిన, ఆత్మయొక్క భ్రాంతులుగాని యథార్థములు గావు. ఆత్మజ్ఞాన ముదయించినంతనే, ఇవన్నియు ఆత్మలో లయించిపోవును. ఆత్మయే అన్ని అనాత్మ జాతము లకు ఆధారమై యుండి, మరల వాటన్నిటినీ తనలో లయించుకొనుచున్నది. నిజముగా ఉన్నది ఆత్మస్వరూపమైన బ్రహ్మమొక్కటియే. వేరు వస్తువు లేదు. ఈ విషయమునే శ్వేతాశ్వతరోపనిషత్తునందు గూడ చెప్పబడినది.

యో యోనిం యోనిమధి తిష్ఠ త్యేకో
యస్మిన్నిదం సం చ విచైతి సర్వమ్।
తమీశానం వరదం దేవమీడ్యం
నిచాయ్యే మాం శాంతి మత్యంతమేతి ॥

అనగా, భగవంతు డొక్కడే అయి వుండి, అ కరూపాలను ధరిస్తూన్నట్లు, వాటిని పర్యవేక్షిస్తూన్నట్లు నటిస్తున్నాడు. ధరించిన వివిధ రూపాలన్నీ మరల ఆయనలో లీనమవుతూ ఉంటాయి. ఆయన ఎల్లప్పుడూ, స్వ ప్రకాశమానుడై వెలిగిపోతూ ఉంటాడు.

కఠోపనిషత్తునందునూ ఈ విధముగా బ్రహ్మ స్వరూపము వర్ణింప బడినది :

ఏకో వ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి
త మాత్మస్థం యేఽను పశ్యంతి ధీరాః
షాం సుఖం శాశ్వతం , తరేషామ్

ఉన్నవాడు పరమేశ్వరు డొక్కడే. మాయాకల్పితములగు సర్వభూతము లకు అంతరాత్మ ఆయన ఒక్క . ఈ సృష్టియందు గోచరించుచుండు వివిధ భూతములకు ఆయ, ఆధారము వాటిని వివిధ రూపములలో పరిణ మింప యుచు, వాటియందు సర్వదా వ్యాపించియుండి, మరల వాటిని తనయందే లయించుకొనుచున్నాడు. అట్టి పరమాత్మ స్వరూపుని ఏ మాన వోత్తములు సాక్షాత్కారము - సికొనుచున్నారో, వారికి ఎల్లకాలము సుఖము, శాంతము లభించును. ఇతరుల కట్టి శాశ్వత సుఖము ప్రాప్తిం చదు.

3

నిర్గుణో నిష్క్రియో నిత్యో
నిర్వికల్పో నిరఞ్జనః
నిర్వికారో నిరాకారో
నిత్యముక్తోస్మి నిర్మలః

**తాత్పర్యము :**

నేను యే గుణములు కర్మలు లేనివాడను. నాకు సంకల్పవికల్పములు లేవు. శాశ్వతమై శుద్ధమై ఎట్టి మాలిన్యము కోరిక లేక నిరాకార, నిశ్చలుడనై నిరంజనుడనై ఎల్లప్పుడు స్వతంతముగా యుండువాడను.

**వివరణ :**

ఆత్మస్వభావ మెట్టిదో విశదీకరించు చున్నారు. నిర్గుణత్వము, అకర్మత్వము ఆత్మలక్షణములు. నామరూపరహితము, మనోబుధ్యతీతము నగు ఆత్మకు, ఇంద్రియ స్వభావములగు గుణములతోగాని, శరీరధర్మములగు కర్మములతోగాని, ఎట్టి సంబంధములేదు. ఆ కారణము వల్లనే, ఆత్మకు రాగద్వేషాది మాలిన్యములుగాని, మనోవిజృంభణములగు కోరికలుగాని ఉండుట కవకాశములేదు. ఆత్మ ఇవేమీ అంటని నిస్సంగుడు. నిరాకార, నిర్మల, నిశ్చల స్వభావుడు. దేని అధీనము కాని స్వతంతుడు. సర్వము ఆత్మయందుద్భవించెడి భ్రాంతులై, మరల ఆత్మయందే లయించుచున్నవి. ఉన్నదీ, ప్రధానమైనదీ ఆత్మ ఒక్కటియే. లేనివీ అప్రధానమైనవీ ఆత్మేతరములు.

అ ప్రాణస్యా మనస్కస్య తథాఽసంసర్గిణో ద్రు ః,
వ్యోమవద్వ్యాపినో హ్యస్య కథం కార్యం భవేన్మమ ॥
(స్వప్నస్మృతి)

ఆత్మకు క్రియాశక్తిగల ప్రాణములేదు. సంకల్ప వికల్ప శక్తిగల మనస్సు లేదు. సంగరహితుడు. ఆకాశమువలె పరిపూర్ణుడు. నిశ్చలుడు. సర్వ ద్రష్టయగు ఆత్మకు వేరొక కార్యముండుట అసంభవము.

ఈ విషయము ముండకోపనిషత్తునందును చెప్పబడెను :

దివ్యో హ్యమూర్తః పురుషః
సబాహ్యా భ్యంతరో హ్యజః ।
అ ప్రాణో హ్యమనాః శు భ్రో
హ్యక్షరాత్ పరతః పరః

అనగా, ఆత్మ స్వయం ప్రకాశము, ఆకారశూన్యము, అనాది, శుద్ధము, సర్వవ్యాపకము. లోపల వెలుపల అంతటను నిండియుండునది. ప్రాణము, మనస్సు నిజంగా లేనిది. అవ్యక్తానికి, అన్నింటికీ అతీతమైనది.

---

అహమాకాశవత్ సర్వ
బహిరన్తర్గ తోచ్యు తః ।
సదా సర్వసమః సిద్ధో
నిస్సఙ్గో నిర్మలోచలః ॥

తాత్పర్యము :

ఆకాశమువలె నేను అన్నిటియందు లోపల బైట నిండియున్నాను. ఎల్లప్పుడూ ఎట్టి మార్పులూ లేక అన్నిటి

యందు సముడనై యుండు ను, శుద్ధుడనై అసంగుడనై
నిర లుడనై ఎట్టి చలనమూ లేకయుందును.

**వివరణ :**

ఆత్మ అనంతము. అపరిమితము. ఆకాశమువలె సర్వవ్యాపకమై అన్నిటియందునూ లోపల బైటా అంతటా వ్యాపించి యుండును. ఆత్మ ని తాపులేదు. ఎట్టి మార్పు, చలనములేని నిస్తరంగ సము ద్రమువలె నిశ్చలముగా నుండుట ఆత్మ లక్షణము. అన్నిటియందు సమత్వము గలిగి యుండి, అజ్ఞాన భూయిష్ఠమగు సంసార దోషములు- ని శుద్ధత్వము ఆత స్వభావము. ఆత్మ నిస్సంగుడు, నిరాకారుడు అగుటచే, ఎట్టి మార్పులు గాని చలనముగాని లేనివాడు. వివేకచూడామణిలో కూడ, శంకర భగ వత్పాదు లాత్మ లక్షణములను ఈ కింది విధముగా వివరించిరి :

ఆకాశవత్ కల్ప విదూరగోఽహ
మాదిత్య వద్భాస్య విలక్షణోఽహం,
ఆహార్య వన్నిత్య వినిశ్చ లోఽహ
మంభోధివత్పార వివర్జితోఽహమ్ ॥

ఆత్మ ఆకాశమువలె అసంగుడు. స్వయం ప్రకాశ స్వరూపు డగు సూర్యుడు సమస్తమును ప్రకాశింపజేయుచూ, వాటికి విలక్షణుడైనట్లు, స్వయం ప్రకాశమాత్రుడగు ఆత్మ, సర్వలోకములను ప్రకాశింపజేయుచూ, వాట న్నిటికంటె విలక్షణుడై యుండును. ఆత్మ పర్వతమువలె నిశ్చలుడు. మాయాకల్పిత వికారముల- ప్రపంచము అ క మార్పులు జెందుచున్నను, మాయాతీతుడగు ఆత్మకు ఎట్టి వికారములును లేవు. అఖండస్వరూపుడగు ఆత్మకు, ఆకాశమునకు వలె, అవధులు లేవు సము ద్రమునకు వలె పారము లేదు.

## 6

నిత్యశుద్ధ విముక్తైక
మఖణ్డానంద మద్వయమ్
సత్యం జ్ఞాన మనంతం యత్
పరం బ్రహ్మమేవతత్ ॥

**తాత్పర్యము :**

ను యదార్థముగా నిత్యము, నిర్మలము, స్వతంతము, అఖండము, అద్వియము అగు పరమానంద సత్యజ్ఞానానంత స్వరూపమై వెలయు ఆ పర బ్రహ్మ స్వరూపము .

**వివరణ :**

ఆత స్వభావాన్ని ప ప చెప్పుచు, సచ్చిదానంద స్వరూపమగు ఆత్మస్వరూపమే మన యదార్థ స్వరూపమని బోధించుచున్నారు. వేదాంత శాస్త్రములో చెప్పిన మరల మరల చెప్పడం పరిపాటి. ఇతర శాస్త్రాల్లో చెప్పిన విషయాన్ని మళ్ళి చెబితే, పునరుక్తి దోషంగా పరిగణింపబడుతుంది. కాని - దాంత తత్వశాస్త్రాలకి పునరుక్తిదోష సూత్రం వర్తించదు. వేదాంత వాక్యాలు హితవాక్యాలు. సులభ గ్రాహ్యాలుకావు. ముముక్షువుల మనస్సులలో నాటుకొని వారికి గ్రాహ్యమగుట కొరకు, మరల మరల బోధించుచు చెప్పిన మరల చెబుతూంటారు. కనుక ఇచట పునరుక్తి దోషము గలుగుచున్నదని భావించటం పాడిగాదు.

నిత్యము, నిర్మలము, స్వతంతము, అఖండము, అద్వితీయము ఆత్మలక్షణములు. ఈ శ్లోకములలో "సత్యం జ్ఞాన మనంతం" అను

ప్రథమము తైత్తిరీయోపనిషత్తునందు బ్రహ్మానందవల్లిలోని ప్రథమోను వాకములో కాననగును.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ
యో వేద విహితం గుహాయాం పరమే వ్యోమన్।
సోఽశ్నుతే సర్వాన్ కామాన్
సహ బ్రహ్మణా విపశ్చి తి॥"

అని ఆ ఉపనిషత్తునందు చెప్పబడినది. అనగా, సత్యస్వరూపమైనది, జ్ఞానస్వరూపమైనది, అనంతమై సర్వత్రా వ్యాపించి యున్నది యగు బ్రహ్మమును ఏ మహనీయుడు తన బుద్ధియందును, హృదయ కుహరము నందునూ తెలిసికొనుచున్నాడో, అతడు జ్ఞానస్వరూపుడగు బ్రహ్మముతో నుండి బ్రహ్మముతోబాటు సకల కామ్యములను అనుభవించును.

బ్రహ్మస్వరూపమే మన సహజస్వరూపమై యున్నది. ఇది జ్ఞానము వలన పొందదగినది. జ్ఞానమే బ్రహ్మస్వరూపము. జ్ఞానము సత్య స్వరూపమగు ఆత్మ ప్రాప్తికి సాధనము. "అహం బ్రహ్మాస్మి" (బ్రహ్మ స్వరూపుండను) అను స్వస్వరూపానుభూతి జ్ఞానము వల్లనే సిద్ధించును.

37

ఏవం నిరంతరాభ్యస్తా
బ్రహ్మైవాస్మీతివాసనా
హరత్యవిద్యా విక్షేపాత్
రోగానివ రసాయనమ్ ॥

**తాత్పర్యము :**

ఈ ప్రకారము "నేను బ్రహ్మమును" అని నిర్విరామ యోచనవలన కలుగు భావము, రసాయన ఔషధము వ్యాధులను నిర్మూలించునట్లు, అజ్ఞానమును, దాని వలన జనించిన సర్వానర్థములను నశింపజేయును.

**వివరణ :**

పై శ్లోకములలో విశదీకరించిన ఆత్మస్వరూపమే తన సహజస్వరూపమై యున్నదని, నిరంతరాభ్యాసము వలన తెలియగలదు. "బ్రహ్మస్వరూపమునై యున్నాను" 'అహం బ్రహ్మాస్మి' అను భావము నిర్విరామయోచన వలన దృఢముగా, సుస్థిరముగా కలుగును. నిరంతర నిర్విరామ సాధన చేయునిదే మాత్రము, అట్టి భావోదయము కలుగజాలదని గుర్తుంచుకొనవలెను. ఏలయన, మనకు సంక్రమించిన సర్వకర్మ కలాపములకును, దేహాత్మబుద్ధి, లేక దేహాభిమానమే మూలకారణమై యున్నదని గ్రహించు కొనవలెను. నేను శరీరము భావ మొక్కటియేకాదు. నేను పురుషుడను, బ్రాహ్మణుడను, అందమైనవాడను, గృహస్థుడను, సుఖముల ననుభవించుచున్నాను, చిక్కియున్నాను, నాకు దుఃఖము కలిగినది, నేను ధనికుడను, నేను తినుచున్నాను, నాకు ఈ ఆస్తులున్నవి అనుకొను అనేక రకముల కర్తృత్వ భోక్తృత్వ భావ పరంపరలతో పాతుకుపోయి వున్న దేహాత్మబుద్ధిని సులభముగా వదలించుకొనుట సాధ్యము కానేరదు. కావున, దేహాత్మబుద్ధి ఎంత దృఢమైయున్నదో, అది వాడిలిపోయి, అంత దృఢముగను ఆత్మసాక్షాత్కారము కలుగుటకు తీవ్రతరమైన సాధనాభ్యాసము యుట అత్యవసరము. ఉత్కటమైన సాధన చేయనిదే ఆధ్యాత్మిక ప్రగతి సిద్ధింపదు. తెలివితో, పట్టుదలతో ఎట్టి ఆటంకములకూ లొంగక సాధన చేయవలసి యున్నది. దృఢమైన వివేకవైరాగ్యములతో,

తప్పనిసరియైన ఇతర కార్యక్రమములను త్వరత్వరగా ముగించుకొనుచు, ఎల్లవేళల సావధానచిత్తుడై తన స్వస్వరూపానుభూతి కొరకు అత్యంత కుతూహలుడై సాధకుడు ధ్యాననిమగ్నుడు కావలెను.

తా. నామరూపరహిత నిర్గుణ పరబ్రహ్మ స్వరూపుడై యున్నాడు. అట్టి విశ్వాసాత్మకమైన అనుభూతి, నిర్విరామ యోచనవలన, తన పవిత్రాంతఃస్ఫురణ కలిగిన తదుపరి, సాధకునకు కలుగును. అంతట అజ్ఞాన జనితములగు, స్థూల, సూక్ష్మ చైతన్యముల భ్రాంతి వదలి, వాటివలన గలుగుచుండు సర్వానర్థములు నశించును. శేషించునది, తన నిజస్వరూపమగు అంతిమ దివ్యానుభవమైన బ్రహ్మానందమే.

తా. బ్రహ్మస్వరూపుడై యున్నాడనను ఆత్మజ్ఞాన ముదయించినంతనే శరీరము, మనస్సు, ఇంద్రియములు, కర్తృత్వ భోక్తృత్వములు, సమస్తములు తనకు కలిగిన భ్రాంతులేగాని, యదార్థముగా, ఇవి ఏమియు లేనివేయని, సాధకునకు కరతలామలకముగా అనుభవమునకు వచ్చును. తనలో ఉద్భవించుచున్న సమస్త సంకల్ప వికల్పములు, సుఖదుఃఖానుభవములు, తదితర ద్వంద్వానుభవములు, మాయాకల్పితములే. అవన్నియు తనయొక్క భ్రాంతులు మాత్రమేకాని, యదార్థముగా ఉనికి లేనివని సాధకునకు తేటతెల్లము కాగలదు

వివిక్తదేశ ఆసీనో
విరాగో విజితేంద్రియః ।
భావయేదేక మాత్మానం
తమనన్త మనన్యధీః ॥

**తాత్పర్యము :**

ఏకాంతమైన ప్రదేశమందు కూర్చొని, మనస్సు నుండి కోరికలను విదల్చుకొని, ఇంద్రియములను స్వాధీన పరచుకొని, నిశ్చలమైన చిత్త ఏకాగ్రతతో, అనంత, అద్వైతమగు ఆత్మస్వరూపమును ధ్యానము - యనగును.

**వివరణ :**

ఆత్మస్థితిని పొందుటకు, ధ్యానసాధనను ఈ శ్లోకమందు తెలుపు చున్నారు. ధ్యానము అనగా స్వస్వరూపాను సంధానము చేసుకొనుటకు, అనుకూలమగు వాతావరణము అత్యావశ్యకరము. ధ్యానమును ఏకాంత మైన ప్రదేశమున కూర్చొని చేయవలెను. సుఖాసనములో కూర్చొన వలెను. కూర్చొనుటకు ఆసనము ఎట్లు తయారు సుకొనవలెనో భగవద్గీ తాది గ్రంథములలో విశదీకరింపబడినది. మరీ ఎత్తుగానీ, పల్లముగాని కానటువంటి ఆసనముమీద, కొంచెము మెత్తనిది అమర్చుకొని, దానిపై తెల్లని వస్త్రము పరచిన, కూర్చొనుటకు సుఖముగా నుండునని శాస్త్రముల యందు చెప్పబడినది. అట్టి ఆసనముపై సుఖముగ కూర్చొని, మనసు నుండి ముందు సకల ఆలోచనలను, కోరికలను, సంకల్పములను తుడిచి వేసి, మనసును శుభ్రముగా చేసుకొనవలెను. అపుడు, ఇంద్రియములను ఇటు నటు పోనీయక అదుపులో నుంచుకొని దృఢమైన వివేక వైరాగ్యము కలిగిన నిశ్చలమైన ప్రేమతో, నీ నిజస్వరూపమగు ఆత్మను అనగా, నీలో సతతము భాసించుచుండు "- ను నేను" అను దానిని చిత్త ఏకా గ్రతతో సంధించుట చేయు ధ్యానమే స్వస్వరూపాను సంధానము. ఇదియే ఆత్మస్వరూప ధ్యానము. విద్యాబుద్ధులు గల కొద్దిపాటి వికసంతు లందరూ ఈ సాధనను సులభముగ నాచరించి ఫలితమును పొందవచ్చును.

ఈ ధ్యానమునకు రెం ముఖ్యాంశములు : మొదటిది, అనాత్మ పదార్థముల స్వభావము నెరింగి వాటిని విసర్జించుచు వాటి తలంపులు మనసులోకి రానీయకుండా కాపాడుకొనుట. రెండవది, సర్వ అనాత్మ పదార్థములను విడనాడిన, ఇక షించు తన నిర్వి ష నిజస్వరూపమై భాసించు చైతన్యా ద్వయానందములో నిమగ్నుడై యుండుట.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు ధ్యాన సమయమున మనస్సునెట్లు నియమించవలెనో, ధ్యానమునకు ఎట్టి ప్ర ము అవసరమో మొదలగు విషయములు ఈ క్రింది శ్లోకములలో వివరించబడినవి :-

త్రిరున్నతం స్థాప్య సమం శరీరం
హృదీం ద్రియాణి మనసా సన్నివేశ్య ।
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయానకాని ॥ 2, 8

అనగా శరీరమును రొమ్ము, కంఠము, తల నిటారుగా నుంచి సుఖాసీనుడై ఇంద్రియాలను, మనస్సుతో కూడా తనలోకి ఉపసంహరించు కొని బ్రహ్మజ్ఞానములో నిమగ్నుడై భయంకరమైన జన్మ మృత్యు సాగ రమును దాటి తరించవలెను.

ప్రాణాన్ ప్రపీడ్యేహ సంయుక్త చేష్టః
క్షీణే ప్రాణే నాసిక యోచ్ఛ్వసీత ।
దుష్టాశ్వ యుక్తమివ వాహమేనం
విద్వాన్ మనోధారయేత ప్రమత్తతః ॥ 2, 9

అనగా, ధ్యానాయుక్తమైన సాధకుడు ముందు ఇంద్రియాలన్ను మనోవృత్తులను అదుపులో పెట్టుకొనవలెను. సమస్త మానసిక చలనము లను ఉపశమింప చేయవలెను. అట్లు ఉపశమించినవాడై, ఎట్టి అజ్ఞా త

ఈ ధ్యానమునకు రెం ముఖ్యాంశములు : మొదటిది, అనాత్మ పదార్థముల స్వభావము నెరిఁగి వాటిని విసర్జించుచు వాటి తలంపులు మనసులోకి రానీయకుండా కాపాడుకొనుట. రెండవది, సర్వ అనాత్మ పదార్థములను విడనాడిన, ఇక షించు తన నిర్వి ష నిజస్వరూపమై భాసించు చైతన్యా ద్వయానందములో నిమగ్నుడై యుండుట.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు ధ్యాన సమయమున మనస్సునెట్లు నియమించవలెనో, ధ్యానమునకు ఎట్టి ప్ర మము అవసరమో మొదలగు విషయములు ఈ ంింది శ్లోకములలో వివరించబడినవి :-

త్రిరున్నతం స్థాప సమం శరీరం
హృదీం దియాణి మనసా సన్నివేశ్య ।
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్
స్రోతాంసి సర్వాణి భయానకాని ॥ 2, 8

అనగా శరీరమును రొమ్ము, కంఠము, తల నిటారుగా నుంచి సుఖాసీనుడై ఇం దియాలను, మనస్సుతో కూడా తనలోకి ఉపసంహరించు కొని బ్రహ్మజ్ఞానములో నిమగ్నుడై భయంకరమైన జన్మ మృత్యు సాగ రమును దాటి తరించవలెను.

ప్రాణాన్ ప్రపీడ్యేహ సంయుక్త చేష్టః
క్షీ ప్రా నాసిక యోచ్ఛ్వసీత ।
దుష్టాశ్వ యుక్తమివ వాహమేనం
విద్వాన్ మనోధారయేత ప్రమత్తతః ॥ 2, 9

అనగా, ధ్యానాయుక్తమైన సాధకుడు ముందు ఇం దియాలను మనోవృత్తులను అదుపులో పెట్టుకొనవలెను. సమస్త మానసిక చలనము లను ఉపశమింప చేయవలెను. అట్లు ఉపశమించినవాడై, ఎట్టి అజాగ్రత్త

## 39

**ఆత్మన్యే వాఖిలం దృశ్యం**
**ప్రవిలాప్య థియాసుధీః**
**భావయేదేక మాత్మానం**
**నిర్మలాకాశవత్ సదా ॥**

**తాత్పర్యము :**

వివేకముగలవాడు బుద్ధియుక్తులతో సమస్తబాహ్య ప్రపంచమును ఆత్మయందే లయించుచు, నిర్మలాకాశము వలె నుండు ఆ యాత్మయం ఎల్లప్పుడును ధ్యాన నిమగ్నుడై యుండవలెను.

**వివరణ :**

ఈ శ్లోకమందు సూచించిన సాధనను లయయోగ మందురు. ఈ లయయోగమునకు తోడ్పడునది జ్ఞానము. జ్ఞానముతో చేయు ధ్యానమే అసలైన భగవధ్యానము కాగలదు జ్ఞానమనగా, అనిత్యములగు మనోబుద్ధ్యహంకారాదులు, పంచేంద్రియములు, పంచభూతములు, శరీరము, ప్రపంచము మున్నగు స్థూల, సూక్ష్మ భ్రాంతుల యదార్థ స్వరూప మెరిగి, వాటిని విస్మరించి, శేషించియున్న "నేనునేను" అని భాసించుచుండెడి తన యదార్థ స్వరూపములో అనుభూతి జెందుట. అట్టి అనుభూతి లక్ష్యమగు ధ్యాన సమయమున, అనిత్యములైన స్థూల సూక్ష్మ భ్రాంతిజన్యములగు భావములేవైనను తలలెత్తుచుండిన, వెనువెంట వాటిని తనలో లయింపజేసికొనుచుండవలెను. ఏలయన, ఆ భ్రాంతిజన్య భావములు

తనకంటె అన్యమైన పేగావు. తనకు కలిగిన భాంతులు తన కన్యమైన వెట్లగును ?

ఉన్నది సత్యస్వరూపమైన ఆత్మ ఒక్కటియే. వేరేదియు, యదార్థముగా, లే. లేదు. ఇదియే పరమసత్యము. ఈ సత్యమును బుద్ధి యుక్తులతో గ్రహించుకొని, సమస్త అనాత్మ పదార్థములనూ, ఆత్మయందు (తనయందు) లయించుచు చేయు ధ్యానమే సర్వోత్కృష్టమైన భగవ ధ్యానము. స్వయం ప్రకాశమై, నిస్తరంగ సముద్రమువలెను నిర్మలాకాశము వలెను నుండు తన నిజస్వరూపమగు ఆత్మయం ఎల్లవేళల మనసు నిలిపి ధ్యాన నిమగ్నుడై యుండుటయే స్వస్వరూపాను సంధానమనబడును ఇట్టి ధ్యాన నిమగ్నుడైన యోగికి, తానును సమస్త విశ్వమును గూడ బహ్మమే.

0

రూపవర్ణాదికం సర్వం
విహాయ పరమార్థవిత్
పరిపూర్ణ చిదానన్ద
స్వరూపేణావ తిష్ఠతే ॥

తాత్పర్యము :

ఎవడు సర్వోత్కృష్టమైన లక్ష్యమును సాధించెనో, అతడు సర్వ నామ రూప వర్ణాది విషయముల నన్నిటిని విసర్జించి, అనంతమగు సచ్చిదానందానుభూతి యందు నివసించు చుండును.

వివరణ :

అట్టి ధ్యానములో ఉత్తీర్ణుడైనవాడు మానవోత్తముడు. సర్వసాధనల అంతిమ లక్ష్యము ధ్యానములో సిద్ధిని పొంది, సమాధియందు స్థితుడై యుండుటయే అజ్ఞానము పూర్తిగా నశించినందున, అలాంటి ధ్యానసిద్ధుడు నామరూప విషయములన్నియు వదలినవాడై నిరాలాత్మకమగు బుద్ధి కలిగి ఎల్లవేళల అఖండము, అనంతము, అద్యంత రహితమునగు బ్రహ్మానందము నందు అనుభూతి జెంది యుండును. పరతత్త్వ బోధలో స్థిరత్వము నొందిన మహనీయునికి బ్రహ్మేతర భ్రాంతి భావము లిక ఉదయించవు.

సమాధియందుండు మహనీయుడు ఆనందమయ కోశమందుండును. అతనికి సర్వమూ ఆనందమయమే. తానే ఆనందమయుడై, ఎల్లవేళల సచ్చిదానందానుభూతి అనుభవించుచుండును. అన్నమయకోశము, ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము, ఆనందమయకోశము, అను పంచకోశములు శరీరములు ఒకదానికంటె మరియొకటి క్రమముగా సూక్ష్మమైనవి. అన్నిటికంటె అత్యంత సూక్ష్మమైనది ఆనందమయకోశము.

భగవంతుడు తాను సూక్ష్మ కారణరూపమున నవ్యక్తముగా నుండు ప్రకృతిని, వివిధ నామరూపములు గల ప్రపంచముగా సృష్టించి, తాను మాత్రమా సృష్టికి భిన్నముగా, ఆనంద స్వరూపుడై యంతటనూ వెలయుచుండును. సర్వజ్ఞుడు, సర్వాధారుడునైన ఆ భగవంతుని సాక్షాత్కరింప జేసికొనుటకు, నిరంతరము ధ్యాన సాధనలు సాధకుడు అభ్యసించుచూ, ఆత్మావరోధములు, మిథ్యాస్వరూపములునగు నశ్వర నామ రూపాత్మక ప్రాపంచిక విషయములను విసర్జించుచూ, అనంతమగు సచ్చిదానందానుభూతియందే, గాలిసోకని దీపమువలె, నిశ్చలుడై యుండును.

జ్ఞాతృ జ్ఞానజ్ఞేయ భేదః
పరే నాత్మని విద్య
చిదానన్దై కరూపత్వా
ద్దీప స్వయమేవ తత్ ॥

**తాత్పర్యము :**

అఖండానంద స్వరూపమే తన స్వభావమగుట వలన, పరమాత్మ జ్ఞాతృ, జ్ఞాన, యములను వి దములు లేనిదై తానొక్కటియే ప్రకాశించుచుండును.

**వివరణ :**

సచ్చిదానంద మయమగు భగవత్ స్వరూపమే తన యదార్థ స్వరూపమని యెరిగిన, ఇక దానిని ఆవరించుకొని యున్న అజ్ఞాన అహంకార త్రిపుటియగు తెలిసికొనువాడు, తెలివి, తెలిసికొనునవి 'జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు' అను విభేదము అంతమొందును క్షీణించియుండున దొక్కటే. తానే. ఆద్యంతములులేని అఖండానంద స్వరూపమే తానై ప్రకాశించుచుండును. ఇదియే 'బ్రహ్మవిద్, బ్రహ్మైవ భవతి'' యనెడి జ్ఞానరూపములో ఏకత్వమును పొందిన పరబ్రహ్మ స్వరూపము.

ఆత్మజ్ఞాన ముదయించనంతవరకు, " ను, నాది'' యను భావము, తెలుసుకొనువాడు, తెలియదగినది యను వము భాసించినను, 'ఆత తత్వము నెరిగిన వానికి భేద భావములన్నియు అంతరించును. ఈ విషయ మునే ఆది శంకరులు, ఉపదేశ సాహసి అచక్షుష్య ప్రకరణములో ఈ విధముగా వివరించిరి :-

దో ఒభేవ స్తథాచైకో నానాచేతి వికల్పితః,
జ్ఞేయం జ్ఞాతా గతిర్గంతా మయ్యేకస్మిన్కృతో భవేత్ ॥

అనగా, ఎట్టి భేదములేక ఒక్కడనై యుండు, నా యందు ను నాది అను దమును, ఒక్కడు, అ కము అనెడి భేదా భేదములును, తెలిసికొనువాడు 'జ్ఞాత', తెలిసికొనదగినది 'జ్ఞేయము' యను భేదమును, ఫలము 'గతి', ఫలమును బొందువాడు 'గంత యు' నను భేదమును అజ్ఞానమువలన కల్పితములైనవేగాని, యదార్థముగా ఇవేవియూ లేనివే. వివేక విజ్ఞానములతో విమర్శించగా ఇవన్నియు ఆత్మ యందు 'నా యందు' లయించి నాలో ఏకమగును.

ఏవమాత్మారణౌ ధ్యాన
మథనే సతతం కృతే
ఉదితావగతి ర్జ్వాలా
సర్వాజ్ఞానేన్ధనం దహేత్ ॥

**తాత్పర్యము :**

ఈ పకారము నిరంతర ధ్యానము యుటవలన, జ్ఞానాగ్ని రగుల్కొని అజ్ఞానపు కట్టెలను పూర్తిగా దహించి వేయును.

**వివరణ :**

అజ్ఞానపు కట్టెలనగా నేవో తెలిసికొనవలెను. అజ్ఞానము వలన

ఉత్పన్నమైన ఆత్మావరోధములే అజ్ఞానపు కట్టెలు. ఆత్మావరోధముల నిర్మూలనమే నిజమైన స కమమైన ఆధ్యాత్మిక సాధనామార్గము కాగలదు.

భగవంతుడు సాధించవలసిన అన్యుడెవరో కాదు. తా. భగవత్ స్వరూపుడై యున్నాడు. తన త , అజ్ఞానము కల్పింపబడిన ఆవరోధముల వలన తన నిజ స్వరూప భగవత్తత్వము, మేఘముల వెనుక సూర్యునివలె మరుగైయున్నది. కనుక, అవరోధములను పోగొట్టుకొనుటయే స్వస్వరూపమగు భగవత్స్వరూపమును పకటితము - సుకొనుట.

పంచభూతములు, పపంచము, శరీరము, పం ం దియములు, పంచ పాణములు, అంతఃకరణ చతుష్టయమగు మనో, బుద్ధి చిత్తాహంకారములు, వాసన త్రయమగు దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన, రాగ ద్వేషాది గుణ సముదాయములు మున్నగునవన్నియు, అజ్ఞాన జనితములగు ఆత్మావరోధములు. వీని నన్నిటినీ అజ్ఞానపు కట్టెలుగా వ ంచినారు. ఏలనన ఇవన్నియు, ఎంతకాలము అజ్ఞానము డునో, అంత కాలము మా తమే ఉండునవి. జ్ఞానాగ్ని రగుల్కొని మండుచున్న వెంట ఈ కాష్ఠము న్నియూ అందులో దగ్ధమగును. అట్టి జ్ఞానాగ్ని రగుల్కొనుటకు, నిరంతర ఆత్మధ్యానము స్వస్వరూపానుసంధానము వతరముగా చేయవలెను. ధృఢమైన వి క వైరాగ్యములతో, తెలివితో, పట్టుదలతో, ఎట్టి ఆటంకములకు లొంగక, నిరంతరము యమనియమాది యోగాంగముల నభ్యసించుచు సాధన - యవలసి ఉన్నది.

అరుణేనైవ బోధేన
పూర్వం తత్తిమిరే హతే
తత ఆవిర్భ వేదాత్మా
స్వయమే వాంశు మానివ ॥

**తాత్పర్యము :**

అరుణోదయపు వెలుతురు చీకటి నశింపగా సూర్యుడెట్లు ఆవిర్భవించునో, అట్లే జ్ఞానమువలన అజ్ఞానము నశించిన పిదప స్వయం ప్రకాశకమగు ఆత్మ భాసించును.

**వివరణ :**

"జ్ఞానా దేవతు కైవల్యం." "జ్ఞానా దేవమోక్షః", "ఏతావదరే ఖల్వమృతత్త్వం" ఇత్యాది శ్రుతులు, ఆత్మజ్ఞానము వలన, స్వస్వరూపమగు బ్రహ్మత్వము సిద్ధించునని బోధించుచున్నవి. కావున మోక్షసాధనము జ్ఞానమేనని శాస్త్రములు నిర్ధారణ చేసినవి. సూర్యుడుదయించిన తోడనే చీకటి తొలగిపోవునట్లు జ్ఞానోదయమయిన వెంటనే, అజ్ఞానము సర్వము పటాపంచలై, ఆత్మానుభూతి కలుగును. అజ్ఞానపు అవరోధము ముసుగు తొలగిపోయిన క్షణములో, స్వయం ప్రకాశము సహజ స్వరూపమునగు ఆత్మ ప్రకాశవంతమై భాసించును. అజ్ఞానమును తొలగించుకొని ఆత్మజ్ఞానమును అనుభవ పూర్వకముగా పొందుటయే అన్ని యోగ సాధనలయొక్క పరమలక్ష్యమై యున్నది. ఈ విషయమునే కృష్ణుడు అర్జునునకు భగవద్గీతలో ఇలా చెప్పినాడు :-

జ్ఞా నతు తదజ్ఞానం
ఏషాం నా శితు మాత్మ నః
షా మాదిత్యవజ్ఞానం
ప్రకాశయతి తత్పరం ॥ (అ. 5, శ్లో, 16)

అనగా, నిరంతర ధ్యానయోగాభ్యాసముల వలన ఉదయించిన వివేక జ్ఞానము చేత ఎవరి అజ్ఞానము నశింప యబడుచున్నదో, వారి యొక్క జ్ఞానము, సకల పదార్థములను సూర్యుడు ప్రకాశింప యునట్లు, అజ్ఞానమునకు బరమైన పరమార్థ తత్వమును (బహ స్వరూపమును) ప్రకాశింప యుచున్నది.

నహిజ్ఞే న సదృశం పవిత్ర మిహ విద ।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మ ని విందతి ॥ అ.4, శ్లో.38

అనగా జ్ఞానముకంటె పవిత్రమైనదేదియును లేదు. ఆత్మ జ్ఞానమును అనుభవ పూర్వకముగా పొందుటయే అన్ని యోగసాధనల యొక్క పరమ లక్ష్యమై యున్నది.

ఆత్మాతు సతతం ప్రాప్తో
ప్రాప్త వదవిద యా
తనా ప్రాప్తవద్భాతి
స్వకంఠాభరణం యథా ॥

**తాత్పర్యము :**

ఆత్మ సతతము ఉంటున్న యదార్థ విషయమైనను, అజ్ఞానము వలన అది పొందబడుట లేదు. అజ్ఞానము నశించిన తోడ ఆత్మ పొందబడుచున్నది. ఇది మెడలో నున్న ఆభరణము కొరకు, తెలివి తక్కువ అంతటను వెదకునట్లున్నది.

**వివరణ :**

మన యదార్థ స్వరూపము ఆనంద నిలయము. అది ఆకార శూన్యము, అక్రియము, ఆద్యంత రహితమునైన ఆత్మ స్వరూపమే. అంతటా ఎల్లవేళలా వెలయుచు యున్నది. కాని, ఇట్టి మన యదార్థ స్థితి అజ్ఞానము వలన మనకు తెలియబడక, ఆవరణ శక్తి మరుగైనది. అహంకార విక్షేపములవలన అట్టి ఆత్మ స్వరూపమందు దేహ భ్రాంతి ఉదయించుటతో, ఇంద్రియముల ప్రవృత్తులలో దగుల్కొని, సంసార భ్రాంతికి వశులమై మన సహజ స్వరూపమగు ఆత్మను కనుగొన జాలకున్నాము. అంతటా ప్రకాశించుచు వెలయుచున్న ఆత్మ అగోచరమగుచున్నది.

భగవంతుడు ఎల్లవేళల అంతటా ప్రత్యక్షంగా ప్రకాశిస్తూనే యున్నాడు. భగవత్ప్రకాశము స్వయం వ్యక్తముగానే యున్నది. అజ్ఞానమువలన దానిని తెలిసికొనలేకున్న, ఆ ప్రకాశము లేదనుట అజ్ఞాని దృష్టిదోషమేగాని యదార్థముగాదు. సూర్యునివలన ప్రపంచమంతా వెలుగుతో ప్రకాశించుచుండగా, గుడ్లగూబకు సూర్యుని ప్రకాశము కానరాదు. దానికి కారణము గుడ్లగూబ దృష్టి దోషమేకాని సూర్య ప్రకాశము లేకపోవుట కాదు గదా! అట్లే అజ్ఞానికి తన నిజస్వరూపమగు

ఆత్మ తెలియబడదు. జాగదావస్థలోకి వచ్చిన వెంటనే, తన దేహము తనకు తెలియబడుచున్నది. ఇంద్రియముల ద్వారా ఐహిక వస్తుజాతములు గోచరించుచున్నవి. దేహముకూడ ఒక ఐహిక వస్తువేకదా ! జడసముదాయమగు దేహము యదార్థముగా తాను గాదు దీనిని విస్మరించి, దేహమే తానని భ్రమించుచు దేహాత్మ బుద్ధి పెంచుకొని జనన మరణ రూప సంసార మాయలో జిక్కుకొనుచున్నాడు. తన యదార్థస్వరూపమైన ఆత్మ మరుగైనది. ఆవరణ విక్షేప శక్తులను మేఘములు దానిని ఆవరించినవి.

సర్వానర్థములకు మూలము అజ్ఞానమే. ఇదియే అవిద్యయనియును, మాయ యనియును చెప్పబడుచున్నది. దీనివలన, ఆవరణ విక్షేప శక్తులు, అహంకార మమకారములు, మోహము, కామము మున్నగు సమస్త దోషములు ఉత్పన్నములగు చున్నవి. సక్రమమైన ఆధ్యాత్మిక సాధనతో అజ్ఞానమయమగు సర్వ అనర్థములను తొలగించుకొనుటతో, మనకు మరుగైన యదార్థ సత్‌చిదానంద స్వరూపమగు ఆత్మ తిరిగి మనకు అనుభూతి యగును.

ఆత్మస్వరూపమే మన యదార్థ స్వరూపము. దానిని మనము నిజముగా పోగొట్టుకొనలేదు. అది ఎల్లప్పుడూ మన సహజస్వరూపమే. అజ్ఞానపు ప్రాబల్యము వలన, దేహాత్మ భ్రాంతి (అనగా దేహమే నేను అనుకొనెడి అసత్యపు భ్రమలో మనముండుట), మన నిజస్వరూపము మనకు లేనట్లు భావించుచుండుట జరుగుచున్నది. మన నిజస్వరూపమే ఐన ఆత్మను మనము తిరిగి పొందుటకు చేయు సాధన, మన మెడలోనే యున్న బంగారు గొలుసు మెడలోనున్నట్లు మరచి, దానికొరకు అంతటనూ వెదకునట్లున్నదని చమత్కారముగా వివరించినారు.

5

స్థాణౌ పురుష వద్భ్రాన్త్యా
కృతా బ్రహ్మణి జీవతా ।
జీవస్య తాత్త్వికే రూపే
తస్మిన్ దృష్టే నివర్తతే ॥

తాత్పర్యము :

చెట్టు మోడు మనిషివలె కన్పించినట్లు, అజ్ఞానము వలన బ్రహ్మమే జీవునివలె గోచరించును. జీవునియొక్క యదార్థ స్వభావము తెలియుట తోడనే ఆతనికున్న జీవత్వము నశించును.

వివరణ :

అజ్ఞానమువల్ల కలిగిన అపోహవలన, మన నిజస్వరూపమగు ఆత్మత్వమునకు బదులు, జీవత్వ భ్రాంతి కలిగి సంసారములో తగుల్కొనుట జరుగుచున్నది. ఈ జీవత్వము, సంసారము యదార్థములు గావు. ఇవి నిజముగా లేనివి. భ్రాంతిజనితములే. జ్ఞానము ఉదయించిన తోడనే జీవత్వము తొలగిపోయి ఆత్మత్వము, సచ్చిదానందమయమై వెలయుచుండును. చీకటిలో దూరము నుంచి, చెట్టుమోడును చూచి మనిషి అని అపోహపడుచూ భ్రమ చెంది, దగ్గరకిపోయి చూచినంత అది మనిషిగాక దాని యదార్థ స్వరూపమగు మోడుగా కన్పించినట్టు, అజ్ఞానము వలన ఆత్మ యందు అసత్యపు జీవభావ ముదయించి, సంసార భ్రమలో తగుల్కొనుట జరుగుచున్నది. కాని నిజముగా పురుగాని సంసారముగాని, ప్రపంచముగాని ఏవియూ లేవి. ఇవన్నియు ఆత్మ

యందు జనించుచున్న భ్రాంతులే. ఆత్మయందు ఈ భ్రాంతుల ఆరోపము నకు మూలకారణ మజ్ఞానము. మోడుయందు అజ్ఞానమువలన కల్పితమగు మనిషి మోడు జ్ఞానమును నివర్తించుచున్నది. ఇది మో ..ను జ్ఞానముద యించిన వెంట, , మోడుయం.దు కల్పితమైన మనిషి భ్రాంతి తొలగిపోవు చున్నది. జ్ఞాన ముదయించినంత-, సర్వ భ్రాంతులూ పటాపంచలై, సత్యము, నిత్యము, అద్వి .యము, ఆనందనిలయము నగు ఆత్మ ప్రకా శించుచుండును.

అహంకారమే జీవత్వము. ఇది శరీరమే నేననుకొను హేళ బుద్ధి. తనను ఒక ప్ర త్యేక ఉనికిగల "తాను"గా అపోహపడుచుండు నంత కాలము, అహంకారమను దేహాత్మ బుద్ధి తనను వదలలేదని గుర్తుంచుకొన వలెను. తాను నిజముగా నామరూపములులేని అపరిమితమగు చైతన్య స్వరూపుడై యుండ, ఒక పరిమితత్వపు ప్ర త్యేక ఉనికిని తనకు భ్రమింప జేయుచూ, అపోహ పెట్టుచుండు, అహంకార భ్రాంతిని, ఏ విధముగ నైనను వదల్చుకొనవలెను. వతరమగు దృఢవిశ్వాసముతో కూడిన ధ్యానాభ్యాసము వలన, ఈ అహంకారము తొలగిపోగలదు. ఎంత పర ం తము ఈ అహంకారము జీవభావము మిగిలియు నుండునో, అంత పర ం తము ఆత్మసాక్షాత్కారము కలుగదు కదా! పరిపూర్ణాత్మానుభూతి కలు గుటకు, అహంకారము నిశ్శేషముగా నశించవలెను. స్థూల శరీరమే "నేను" అనుకొనెడి అసత్యపు భావన అనాదిగా అలవాటుపడి యుండుట వలన, దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన యను వాసనత్రయము సులభముగ వదలక, కాళ్ళకు తగిల్చిన సంకెళ్ళవలె ఆత్మానుభూతికి ప్రతిబంధకములై యుండును. జ్ఞానమువలన అహంకారము నిశ్శేషముగ తొలగిపోయిన వెంట-, నిత్యానంద స్వరూపమైన ఆత్మ తన స్వస్థితి యందు ప్రకాశించును.

## 6

తత్త్వ స్వరూపాను భవాద్
ఉత్పన్న జ్ఞాన మఞ్జసా,
అహం మమేతి ఆత్మానం
బాధతే దిగ్భ్రమాదివత్ ॥

**తాత్పర్యము :**

సూర్యుడు చీకటివలన కలుగు సమస్త అరిష్టము లను పోగొట్టినట్లు, తత్వజ్ఞానజనితమగు స్వస్వరూపాను భవము కలుగుటవలన "నేను, నాది" అనుకొనెడి అజ్ఞా నము వెనువెంట. నిర్మూలింపబడును.

**వివరణ :**

"నేను" అనునది రెండు విధములు. నేను శరీరము ననుకొనెడి అజ్ఞానపు భ్రాంతి భావమగు అహంకారము మొదటిది. దీనినే దేహాత్మబుద్ధి అందురు. ఈ అహంకార భ్రాంతి మూలమున, "నాది" అను మమకార భ్రాంతి ఉత్పన్నమగును. ఇక రెండవది "నేనునేను" అనుకొను సర్వకాల సర్వావస్థలలోనూ భాసించునదేదో దానిని "నేతినేతి"(అనగా ఇదికాదు, ఇది కాదు) అను నిషేధకమైన సాధనాభ్యాసముల వలన శోధించి తెలుసు కొనిన, అది దేహాతీతమగు నామరూప రహితమైన ఆత్మ స్వరూపమే యగును. ఇదియే "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్య ప్రకటిత పరబ్రహ్మతత్త్వము. ఏ "నేను" అజ్ఞానమువలన తాను దేహమని భ్రమించుచు, "ఇది నాది" అనెడి సంసారములో చిక్కుకొనుచున్నాడో

ఆ నేనే, సాక్షిన వలన జ్ఞానముదయించి నంత. భ్రమ నివారణమై అజ్ఞానము తొలగి, తా సచ్చిదానందమయ మగు ఆత్మ స్వరూపునిగా గుర్తించుకొని, ఆనంద నిమగ్నమగును. చీకటిలో కలుగు అన్ని అరిష్టములు సూర్యుని వెలుతురు వలన మాయమగునట్లు అజ్ఞానము తొలగగనే, దేహ భ్రాంతివదలి, కర్తృత్వ భోక్తృత్వ భ్రాంతులన్నియు నశించి మన యదార్థ స్వభావమగు ఆత్మ సచ్చిదానందమయమై భాసించును. ఈ విషయమునే ఆది శంకరులు ఉపదేశ సాహస్రిలో స్వప్నస్మృతి ప్రకరణమందీ విధముగా వివరించినారు :-

ఆత్మా హ్యం యమి త్యేష భావోఽవిద్యా ప్రకల్పితః
ఆత్మైక త్వే హ్యసౌ నాస్తి బీజాభావే కుతఃఫలమ్ ॥

అనగా, అవిద్యవలన నేను అను అహంకారము, నాది యను సంసారము కల్పితమగుచున్నవి. ఆత్మ జ్ఞాన ముదయించినంతనే అనగా, సర్వమూ, అంతటా లోపలా బయటా, సకల జగద్బాధావధియైన ఆత్మ స్వరూపము గనే విలసిల్లు తన నిజస్వరూపముగా తెలిసికొనిన, అవిద్య యంతయు తొలగిపోవును. విత్తనమును వేయించిన, దానియందలి ఉత్పత్తి శక్తి నశించుటచే, మొలక మొలవదు. అట్లే అవిద్య నశించిన, నేను అను అహంకారము దేహాత్మబుద్ధి, నాది యను సంసారము నామమాత్రము లుగా నుండిపోవును కాని ఫల ప్రదములు గావు.

7

సమ్యక్ విజ్ఞానవాన్ యోగీ
స్వాత్మన్యే వాఖిలం జగమ్ ।
ఏకం చ సర్వమాత్మానమ్
ఈక్షతే జ్ఞాన చక్షుషా ॥

**తాత్పర్యము :**

పరిపూర్ణ విజ్ఞానమును పొందిన యోగీశ్వరుడు, తన జ్ఞాననేత్రము ద్వారా తన ఆత్మలో సర్వవిశ్వమును గాంచుచు, అంతయూ ఆత్మస్వరూపమే గాని ఇతర మేదియూ లేదని తెలుసుకొనును.

**వివరణ :**

పరిపూర్ణ జ్ఞాన మనగా, మిథ్యాస్వరూపములగు అనాత్మ పదార్థములైన శరీరము, మనస్సు, ఇంద్రియములు, అంతఃకరణ చతుష్టయము, పంచభూతములు మున్నగు ప్రకృతి వికారముల యదార్థ స్వరూపమును తెలుసుకొనుట వలన అవన్నియూ వట్టి భ్రాంతులై తన లోనే లయించిపోయి, తాను ఏకైక సత్చిదానందాత్మ స్వరూపుడ ననుభావ ముదయించి, అట్టి అనుభూతిలో సర్వకాల సర్వావస్థలయందు స్థిరత్వము నొందుట. ఇట్టి జ్ఞానసిద్ధునకు, సర్వచిత్త వృత్తులు శాంతించి పరమాత్మలో అనగా తనలో లయించును. అతడు వికార రహితుడై ఎల్లప్పుడూ శాంతము, ఆనందము కలిగి విరాజిల్లును. ఎట్టి సంకల్ప వికల్పములు అతనిలో కలుగవు. అతనికిక దేహేంద్రియాదులు వాస్తవికములుగా లేవు. తాను బ్రహ్మమునని దృఢ నిశ్చయము కలిగి, నిరతిశయానందమున మునిగి యుండును. ఇట్టి పరతత్త్వ బోధలో స్థిరత్వము కలిగిన జ్ఞానసిద్ధునకు, తనకంటె ఇతర వస్తువేదీ గోచరింపదు. ఇదియే పరమాద్వైత స్థితి. ఈ స్థితిలో బ్రహ్మేతర మెద్దియూ స్ఫురింపదు. ఎల్లప్పుడూ అధిష్ఠాన బ్రహ్మమే స్ఫురించుచుండును. వన్ముక్తి స్థితి యన నిదియే.

వన్ముక్తునకు జ్ఞాననేత్రము వికసించుటచే విశ్వము సర్వము తానేయై తనకంటె ఇతర వస్తువేదీ గోచరింపదు. సర్వమూ ఏకైక

స్వరూపుడైన తా. . "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనెడి జ్ఞానరూపములో, ఏకత్వము పొందిన పరబ్రహ్మ స్వరూపుడైనాడు. జీవాత్మ, పరమాత్మ, మనస్సు, బుద్ధి, అహంకారము, ఇంద్రియ కూటమి, శరీరము, ప్రపంచము, అన్నీ ఒకటే. అవన్నీ వట్టి కల్పనలు మాత్రమే. కల్పనలు పరమాత్మకు భిన్నము కాజాలవు. ఉన్నది పరమాత్మ ఒక్కటే. రెండవది లేనేలేదు. భేదభావనల కిక ఎంతమాత్రమూ తావులేదు. ఇదియే పరిపూర్ణ జ్ఞానము. సర్వమానవులు ఎప్పుడో ఒకప్పుడు పొందవలసిన దివ్య గమ్యము.

ఆత్మైవేదం జగత్ సర్వం
ఆత్మనోఽన్యన్న విద్యతే ।
మృదాయద్వత్ ఘటాదీని
స్వాత్మానం సర్వమీక్షతే ॥

**తాత్పర్యము :**

గోచరమగు జగత్తు సర్వమూ నిజముగా ఆత్మయే. ఆత్మ తప్ప ఇతరమేదియూ లేదు. మట్టితో తయారు కాబడిన కుండలు, జాడీలు మున్నగునవి మట్టియేకాని వేరేదియూ కానట్లు, జ్ఞానికి గోచరించు సర్వము ఆత్మయేకాని ఆత్మేతర మెద్దియునూ లేదు.

**వివరణ :**

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అను పరమ సత్యమైన సిద్ధాంతాన్ని ఈ శ్లోకంలో పునరుద్ఘాటించారు. గోచరించుచున్నవన్నీ ఆత్మస్వరూపమే.

ఆత్మేతర వస్తువేదీ లేదు. కుండలు, జాలు, ప్రమిదెలు మున్నగు మృణ్మయ పదార్థ జాతమంతా, మట్టియేకాని మట్టికంటె వేరేదీ కాదు. అలాగే జీవన్ముక్త స్థితిని పొందిన పరిపూర్ణ జ్ఞానసిద్ధునికి సర్వమునూ ఆత్మగా గోచరిస్తుంది. వేరేదీ స్ఫురించదు. పాంచభౌతిక అస్తిత్వం అతనికి వదలిపోయినది. సర్వమూ ఏకైక సత్యస్వరూపుడైన తా . అతనికి పరమాత తప్ప మరొకటిలేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్న సత్యానుభూతిని పొందినాడు.

శ్రీ రామకృష్ణ పరమహంస వన్ముక్త స్థితిని పొందిన పరిపూర్ణ జ్ఞానసిద్ధుడు. తనకు తెలిసినది భగవంతు డొక్క డని, తదితర విష యములేవీ తనకు తెలియవని శిష్యులతో పరమహంస చెప్పుచుండెడి వాడట. అనగా భగవంతు డొక్క యదార్థముగా ప్రపంచమందంతటను ఎల్లవేళలా వెలయుచుండువాడు. భగవ తర విషయములన్నీ మిథ్యా స్వరూపములు కనుక నిజముగా అవి లేనివే.

వివేకచూడామణి యందు ఆదిశంకరులు బోధించిన పరతత్వమును గ్రహించినవాడై, శిష్యుడు కొంతకాలము ఆత్మానుభూతి యందు ఆనంద నిమగ్నుడై, సమాధి స్థితినుండి లేచి తన అనుభవమును యీ విధముగా గురువరేణ్యులతో విన్నవించెను :

క్వగతం కేన వానీతం క త లీనమిదం జగత్
అధునైవ మయాదృష్టం నాస్తికిం మహదద్భుతమ్ ॥
కిం హేయం కిముపాదేయం కిమన్యత్కిం విలక్షణం,
అఖండానన్ద పీయూషపూర్ణే బ్రహ్మమహార్ణవే ॥
న కించి ద త పశ్యామి న శృణోమి నవేద్మ్యహం,
స్వాత్మనైవ సదానన్ద రూపేణాస్మి విలక్షణః ॥

"జ్ఞానముదయించి సమాధి స్థితిని పొందగా, ఈ జగత్తు సర్వమూ ఎచటికి బోయను? ఎచ్చట లీనమయ్యేను? అప్పుడు లేకపోయి మరల ఇపుడు చూడబడుచున్నది. ఎంత ఆశ్చర్యము?

తెలుసుకోవలసినదిగాని, తదితరమైనది గాని, బ్రహ్మవిలక్షణమైనదిగాని ఏవియు లేవు. అంతా అఖండానందామృత పూర్ణమైన బ్రహ్మమనెడి మహాసముద్రమే.

నాకేమియు గోచరించుటలేదు, యేమియు వినిపించుటలేదు. ఏమియు తెలియుటలేదు. అంతా సదానందాత్మస్వరూపమైన అయియున్నాను. నాకంటె విలక్షణమైన దీ నాకు స్ఫురించుట లేదు."

ఇలా పరతత్వ బోధలో స్థిరత్వము కలిగిన సాధకునికి, ఆత్మస్వరూపుడైన తనకంటె ఇతర వస్తువేదీ ఇక గోచరింపదు. తాను పరమాద్వైత స్థితిని పొందినాడు. కనుక బ్రహ్మేతరమేదీ తనకు స్ఫురింపదు. ఎల్లప్పుడును అధిష్టాన బ్రహ్మము మాత్రమే స్ఫురించుచుండును. ఇదియే జీవన్ముక్త స్థితి.

## 49

జీవన్ముక్తస్తు తద్ విద్వాన్
పూర్వోపాధి గుణాం స్త్యజేత్ ।
సచ్చిదానన్దరూపత్వం
భజేద్ భ్రమర కీటవత్ ॥

**తాత్పర్యము :**

ఆత్మజ్ఞానమును పొందిన జీవన్ముక్తుడు తన పూర్వ ఉపాధులవలన గలిగిన వాసనలను (స్వభావములను) వదలివేయును. తన యదార్థ స్వభావమగు సత్‌చిదానంద స్వరూపమును తెలిసికొనిన వాడగుటవలన, గొంగళి పురుగు భ్రమరముగా నైనట్లు తాను యదార్థముగా బ్రహ్మ స్వరూపు డగును.

**వివరణ :**

ఆత్మ జ్ఞానమును పొందుట యనగా స్వస్వరూపానుభూతి కలిగి, తన నిజస్వభావమగు సత్‌చిదానందములో నిమగ్నమగుట. ఇదియే జీవన్ముక్తస్థితి. సర్వోత్కృష్టమైన ఈ స్థితిని పొందిన జ్ఞానికిక నేను, నీవు, అది, ఇది అన్న భేదబుద్ధి ఉండదు. జీవాత్మ, పరమాత్మ, మనసు, బుద్ధి, అహంకారము, ఇంద్రియములు, శరీరము, ప్రపంచము మున్నగు అన్ని అనాత్మ పదార్థములూ తనలో లయించును. పాంచభౌతిక అస్తిత్వము అతనికి వదలిపోయినది ఇవన్నీ కల్పనలు, భ్రాంతులుగాని యదార్థములు గావని తెలుసుకొనుటచే, వాటినన్నింటినీ అతను విసర్జించును. బ్రహ్మస్వరూపుడై ఎల్లప్పుడూ ప్రకాశించుచుండును.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములగు పంచేంద్రియములు బహు దుర్గమమగు ఆత్మావరోధములు. వీటి ప్రభావము వలననే విషయచింతన ఉత్పన్నమగుచుండును. విషయచింతనకు మూలము విషయ వాసనలు. దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన యని ఇవి మూడు విధములుగా నున్నవి. ఈ వాసనలు కాళ్ళకు తగిల్చిన సంకెళ్ళవలె ప్రతిబంధకములైన ఆత్మావరోధములై యుండును.

లోక వాసనయా జన్తోః శాస్త్రవాసన యాపచ ।
హ వాసనయా జ్ఞానం యథావన్నైవ జాయ ॥

అని ము క్తికోపనిషత్తునందు జెప్పబడినది. అనగా, హవాసన, లోకవాసన, శాస్త్రవాసన అను వాసనా తయము వలన, ఎంత సాధన- యుచున్నను, జ్ఞానము పరిపూర్ణముగా పొందజాలక లక్ష్యమును సాధించుట అసంభవ మగును. ఇక నీ వాసనలెట్టివో పరి లించవలసి యున్నది :

1. హవాసన :- దేహమే ననుకొను భ్రాంతివలన ఉత్పన్న మగు, శరీరమందు గల రాగపూర్వకమైన మమకారము. దేహమతి హేయమై అనిత్యమైనదైనను, దాని మీద వ్యామోహమును పెంచుకొనుచూ దాని పోషణకై, వేషధారణకై పడు తాప తయమే దేహవాసన.

2. లోకవాసన :- తన గుణములను పకటించుట యందు ప్రీతి; లోకములో తనకు పేరు ఖ్యాతులు కావలయునను కోరిక; ధన, దారా పు తాదులయందు రాగము, పరుల గుణవిశేషములపట్ల ద్వేషము, జగ త్తులో కానవచ్చు విషయములయందు ఆకాంక్ష, అను నీ మొదలగున వన్నియూ లోకవాసన యనబడును.

3. శాస్త్రవాసన :- శాస్త్రముల మీద మూఢవిశ్వాసము. పుస్త కములు, శాస్త్రములు, వేదాంతగోష్ఠి, తర్కము, పాండిత్యము మొదలగు వాటియందు గల వ్యామోహము, శాస్త్రపాఠానుష్ఠానమందు గల పీతి శాస్త్ర వాసన యనబడును.

పై జెప్పబడిన మూడు వాసనలు పతి వ్యక్తికి ఇనుప సంకెళ్ళ వంటివి. ఇవి ఆత్మజ్ఞానము పొందుటకు ముఖ్యావరోధములు. లోకవాస నకు సంబంధించినవే దారైషణ, పుత్రైషణ, ధనైషణ లేక విత్తైషణ అనునవి. వీని ఏషణ తయ మందురు.

పైన వివరించిన శబ్దాది బాహ్యవిషయజాతమును, పం ం దియము లను, సమస్త విషయ వాసనలను, ను, నాది అనెడి అసత్యపు అహంకార మమకార భావనలను, పత్య గూప చిదాత్మయందు లయింపం సి, నిరంతరము ధ్యాననిష్ఠుడైన సాధకుడు, సంసారమునుండి విముక్తుడు కాగలడు. తుమ్మెదవలన భయపడు కీటకము, సదా భమరమునే ధ్యానించుచు చివరకు తానే భమరముగా మారును. దీని భమర టక న్యాయమందురు. ఆదిశంకరులు వివేకచూడామణిలో భమర టక న్యాయమును, యీ కింది విధముగా తెలిపియుండిరి :

కియాంత రాస క్తిమపాస్య టకో
ధా యన్యధాలిం హ్యలిభావ మృఛతి,
తద్దైవయోగీ పరమాత్మ తత్త్వం
ధ్యాత్వా సమాయాతి త కనిష్ఠయా ॥ వి చూ. 360

అనగా, ఇతరమైన దేనియందూ ియాసక్తి లేక, టకము సదా భమరమునే ధ్యానించుచు, తాను భమరమే యైనట్లు, ఎట్టి కియాసక్తి లేనివాడై, తదేక దీక్షతో ఏ యోగిపుంగవుడు పరమాత తత్త్వమునే ధ్యానించుచుండునో అట్టి మహనీయుడు బహ్మమే యగును.

**50**

**తీర్త్వా మోహార్ణవం హత్వా**
**రాగద్వేషాది రాక్షసాన్ ।**
**యోగీశాన్తి సమాయుక్త**
**ఆత్మారామో విరాజతే ॥**

**తాత్పర్యము :**

జీవన్ముక్తుడైన యోగి, భ్రాంతిజనితమగు అంధ కార సముద్రమును దాటిన తదుపరి, రాగద్వేషములను రాక్షసులను సంహరించి; శాంతిని పొందినవాడై, ఆత్మానుభూతి కలుగుటవలన బ్రహ్మానందములో నివశించి యుండును.

**వివరణ :**

జీవన్ముక్తిత్వమును ఈ శ్లోకమందు పొందుపరచినారు. ఆత్మేతర పదార్థము లన్నియు భ్రాంతిజనితములే. జీవన్ముక్తుని దృష్టిలో దేహేంద్రియాదులు వాస్తవికములుగా లేనివే. అతనికి నేనే బ్రహ్మమును అను దృఢనిశ్చయము కలిగినది.

భ్రాంతి, అజ్ఞానము, అవిద్య ఇవన్నీ ఒకటే. దీనికి మాయ సృష్టికర్త. సత్యమైనదానిని అసత్యముగను, అసత్యమైన దానిని సత్యముగను, తోపజేయు అనిర్వచనీయమైన శక్తియే మాయ అనబడుచున్నది. స్వప్నమందు దోచు సర్వవిషయములు కల్పితములై, ఏ ప్రకార మసత్యములో, ఆ విధముగనే ఈ దృశ్య ప్రపంచము, శరీరము, పంచ ప్రాణములు, పంచేంద్రియములు, అహంకారాది సర్వవికారములును జ్ఞానోత్పత్తి అయిన వెంటనే మిథ్యగా తెలియబడును. అట్టి ఆత్మజ్ఞాని యగు జీవన్ముక్తునకు, జరామరణములు గాని, క్షుత్పిపాసలుగాని ఉండవు. రాగద్వేషములు, శోకమోహములు మున్నగు ద్వంద్వ భావములు అతని కెప్పుడునూ కలుగవు. సర్వదుఃఖ భూయిష్ఠ భావములను వదలించుకొనినవాడై పరమ శాంతమును కలిగియుండును. ఎల్లకాలా బ్రహ్మానుభవములో నిమగ్నుడై యుండు ఆత్మజ్ఞానికిక స్థూల, సూక్ష్మ, కారణములను మూడు శరీరములు గాని, జాగత్, స్వప్న, సుషుప్త్యావస్థలుగానీ ఉండవు. ఆదిశంకరులు వ

న్ముక్తుని లక్షణములను వారి "సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహం" లో ఈ కింది విధముగా వివరించినారు :

శ్లో॥ య స్సమస్తార్థ జా షు వ్యవహార్యపి తలః
పదార్థేష్వపి పూర్ణాత్మా సజీవన్ముక్త ఉచ్య ॥

అనగా, ఎవడు సకల కర్ లను ఆచరించు చున్నప్పటికినీ, హృదయ మందు రాగ ్వేషములు లేనివాడై పసన్నచిత్తుడగు చున్నాడో, ఎవడు అన్నిటి యందును తన తెలుసుకొని తానేసర్వ స్వరూపుడ నను భావన కలిగియున్నాడో, వాడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

ఈ శ్లోకమందు రామాయణములోని అంశమును జ్ఞానదృష్టితో గమనించ నగును. సాధకు ఆత్మా రాముడు. రామాయణములోని రాముడు పోగొట్టుకొనిన ఆత్మానందము అను సీతను, అ ్వేషించి పొందు టకై, అజ్ఞానమను సము ద్రమును దాటి లంక యందు గల రాగ, ద్వేష, కామ, కోధాది రాక్షసులను సంహరించి, తిరిగి ఆనందమయమగు సీతను పొందెను.

## 5

బాహ్యే ఉనిత సుఖాస్త్రం
హితాత్మ సుఖనిర్వ్రృ ః
ఘటస్థదీపవత్ స్వస్థం
స్వాత్మనేవ ప్రకాశతే ॥

**తాత్పర్యము :**

భ్రాంతి జనితములగు బాహ్య సుఖముల మీద ఆసక్తి వదలినవాడై, ఆత్మయందే నివశించు జీవన్ముక్తుడు, ఆత్మానుభూతి వలన పొందు బ్రహ్మానందముచే పరితుప్తుడై, జా॰ యందుంచబడిన దీపమువలె తనలో తాను ప్రకాశించుచుండును.

**వివరణ :**

చెప్పినదే చెప్పుచున్నారు. సాధకుల మనసులలో నాటుకొనుటకు, చెప్పిన మరల మరల చెప్పుట ఆధ్యాత్మిక సాహిత్యములోని విశిష్టత.

ఆత్మానుభూతి కలిగిన మహానుభావుడైన జీవన్ముక్తునకు, భ్రాంతి జనితములగు బాహ్యసుఖముల మీద జిజ్ఞాస కలుగుట అసంభవము. వన్ముక్తునకు, ఆ త్మేతర పదార్థ జాతమంతయు, స్వప్నములోని విషయముల వలె, మిథ్యాస్వరూపములే యను జ్ఞానము స్థిరపడుట వలన, వాటియందెట్టి ఆసక్తిగాని, ఆలోచనగాని కలుగదు. అతనికి ఆత్మానుభూతి తప్ప వేరొకటి స్ఫురించదు ఆత్మస్ఫూర్తి సర్వేతర స్ఫూర్తులకు స్వస్తి చెప్పును. వన్ముక్తుని దృష్టిలో ఆత్మయొక్కటియే సత్యముగా ఉన్నటువంటిది. మిగతావన్నీ ఆత్మయొక్క భ్రాంతి జాతములే.

పూర్వోక్త ప్రకారము, ఆత్మానుభూతిని పొంది బ్రహ్మము॰ం చిత్తమును సదా లయింప ॰, ప్రవాహరూపముగ నిర్వికల్ప సమాధి యందు స్థిరత్వమునొందిన మహనీయుడు, చలనములేని దీపమువలె తన యందే తాను ప్రకాశించుచుండును. ఇట్టి సర్వోత్కృష్టమగు జీవిత లక్ష మును సాధించిన వానిని స్థిత ప్రజ్ఞుడందురు. గీతలో శ్రీకృష్ణభగవానుడర్జునున విషయమున ఈ కింది శ్లోకమునందు విశదపరచెను :

ప్రజహాతి యదాకామాన్ సర్వాన్పార్థమనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥

(అ. 2 - శ్లో. 55)

అనగా, మనస్సునందున్న సమస్త కోరికలను పూర్తిగా వదలివేసి, స్వస్వరూపమునందే (అనగా తనను తనయందే) బహుముగా తెలిసికొని సంతోషించుచున్నవాడై ఏ మహానుభావుడు వెలయుచున్నాడో, ఆతడు స్థిత ప్రజ్ఞుడు (నిశ్చలమైన ప్రజ్ఞ లేదా ఆత్మజ్ఞానము కలవాడు) అగుచున్నాడు.

ప్రజ్ఞానఘనమైన ఆత్మస్థితిని పొందినవాడు, నిత్యానంద స్వరూపుడై తన స్వస్థితియందు నిశ్చలుడై ప్రకాశించుచుండును. తాను మహిత, నాశరహిత, నిత్య సత్యాత్మ స్వరూపుడను అనెడి భావము ఆతనికి అనుభూతమైనది. అతడు యదార్థ ప్రజ్ఞ అయినాడు. పంచ కోశములకు భిన్నుడై, సత్య జ్ఞానానంద స్వరూపుడై బ్రహ్మనిష్ఠయందు స్థిరత్వము పొందిన మహనీయునికి ఇక జనన మరణ భయము కలుగ రదు. తన యదార్థ స్వరూపమగు ఆత్మస్థితిని పొందిన వానికి సంకల్ప వికల్పములు కలుగవు. ఆత్మ స్వరూపుడైన తనకంటె ఇతర వస్తువేదీ గోచరించదు. తాను పరమాద్వైత స్థితిని పొందినాడు. కనుక తనకు బహిఃతరమేదియూ స్ఫురింపదు. ఎల్లప్పుడూ అధిష్ఠాన బ్రహ్మము మాత్రమే స్ఫురించుచుండును. ఇదియే సన్ముక్త స్థితి.

## 5

ఉపాధిస్థోపి తద్ధర్మై
ర్నిర్లిప్తో వ్యోమ వన్మునిః
సర్వ విన్మూఢవత్ తిష్ఠే
దసక్తో వాయువచ్చరేత్ ॥

**తాత్పర్యము :**

ధ్యాన నిమగ్నుడైన సాధువు ఉపాధులతో కలిసి యున్నను, ఆకాశమువలె వాటి లక్షణముతో మాలిన్యము పొందనివాడై, మూగవానివలె అన్ని పరిస్థితులలోను నిశ్చలముగానుండును. గాలివలె నితోను సంబంధము లేని వాడై తిరుగుచుండును.

**వివరణ :**

ఆత్మజ్ఞానము సంపూర్ణముగ పొంది ధ్యాన నిమగ్నుడైన జీవన్ముక్తుని లక్షణములను ఇంకనూ తెలుపుచున్నారు. అట్టి మహనీయుడు సంసారమునందుండిననూ, అసంసారియే. దేహాభిమానములేని అట్టి పరమ జ్ఞాని శరీరధారియైననూ, అశరీరు . కర్తృత్వ భ్రాంతి వదలుటచే, నిమిత్త మాత్రముగా యేమేమి చేయుచున్నను, అతడకర్తయే. కర్మముల ఫలములు అతని నంటవు. ఉపాధులతో నున్ననూ, ద్వంద్వభావము లగు సుఖదుఃఖములు, రాగద్వేషములు, శోకమోహములు, పుణ్యపాపములు మున్నగునవి అతని కెంతమాత్రము లేవు. అనగా, కర్మముల నాచరించుచు, సకల వ్యవహారములలో నున్నప్పటి , రాగ ద్వేషాది రహితుడైన బ్రహ్మజ్ఞానికి తాను కర్తనను భావముగాని, కర్మ ఫలముల యందిచ్ఛగాని

ఎంతమాత్రము ఉండవు. వాని హృదయము ఈ నిర్మాలిన్యము లన్నిటినీ వీడినదై, నిర్మలము, నిశ్చలము గలిగినదై, ప్రసన్నతతో నిండి మౌనావస్థ యందుండును. ప్రపంచమునందెన్ని కార్యక్రమములు జరుగుచున్నను, ఆకాశము వాటి నంటకయున్నట్లు, జీవన్ముక్తుడు తనచే చేయబడుచున్న కార్యకలాపముల నంటక వాటి కతీతుడై తటస్థముగ నుండును. నిజముగా దేహేంద్రియాది అనాత్మ పదార్థము లేవియు ఆ మహనీయునకు లేవు. వీటితో ఎట్టి సంబంధముగాని తాదాత్మ్యభావముగాని లేక, ఎల్లప్పుడు నామరూప రహితమగు తన యదార్థ స్వరూప సచ్చిదానందములో నిమగ్నుడై సంచరించుచుండును.

ఆదిశంకరులు వివేకచూడామణి యందీ విషయమునే క్రింది శ్లోకములలో వివరించిరి :-

స్వమసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభో యథా,
నశ్లిష్య యతిః కించిత్కదాచిద్భావి కర్మభిః ॥
న నభో ఘటయోగేన సురాగంధేన లిప్యతే
తథాత్మోపాధి యోగేన తద్ధర్మైర్నైవ లిప్యతే ॥
450 - 451

అనగా, మానసిక కల్పితములగు స్వాప్నిక కర్మలు మేల్కొనిన పిమ్మట ఫలవంతములెట్లు కాజాలవో, అలాగే జ్ఞానము కలిగిన మహనీయుడు తాను ఆకాశమువలె దేనినీ అంటక సంగరహితుండనని తెలిసికొని తాను నిమిత్తమాత్రముగా చేయు కర్మలతో నెంతమాత్రము సంబంధము లేక ఎల్లవేళలా ప్రసన్నచిత్తుడై యుండును.

ఘటమునందున్న ఆకాశమును ఘటాకాశ మందురు. ఆ ఆకాశమునకును ఘటమునకును ఎట్టి సంబంధములేదు. ఆకాశము రూపరహితమ్ము,

నిర్మలము. ఘటము ఆకారము కలిగిన మలిన పదార్థము. ఘటముయొక్క సంయోగము వలన ఘటమునందున్న మద్యముయొక్క దుర్వాసన, ఘటాకాశము నంటదు. ఈ విధముగనే ఉపాధి యగు శరీరమునకునూ, నామ రూప రహిత పరిశుద్ధమగు ఆత్మకును, సంబంధ మేమియూ లేదు. సంబంధ మంతయూ అజ్ఞానమువలన కల్పింపబడిన ఆరోపితమే. జ్ఞాన ముదయించి నంతనే కర్తృత్వమంతయూ మానసిక సృష్టియేకాని యదార్థముగాదని తెలిసిపోవుటచే, ఆత్మజ్ఞాని వాటి పుణ్యాపాప ఫలములను పొందడు.

## 5

ఉపాధి విలయాద్ విష్ణౌ
నిర్విశేషం విశేన్మునిః ।
జలే జలం వియద్వ్యోమ్ని
తేజస్తేజసి వా యథా ॥

**తాత్పర్యము :**

ధ్యాననిమగ్నుడైన సాధువు, ఉపాధులు నశించి నంత , నీటిలో నీరు, ఆకాశములో ఆకాశము, వెలుతురులో వెలుతురు వలె అంతటా వ్యాపితమైయున్న శక్తిస్వరూపు డగు విష్ణువులో పూర్తిగా ఐక్యత పొందుచున్నాడు.

**వివరణ :**

అంతఃకరణము వునకు ఉపాధి. అంతఃకరణము నాలుగు విభాగములు- మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. వీటికి అంతఃకరణ

చతుష్టయమను వాడుక. ఉపాధులు, భిన్నములు, అనేకములు ఐనను చైతన్య మొక్కటే.

దేహాదికములైన ఉపాధులు ఆత్మావరోధములు. అవన్నీ భ్రాంతి జనితములు. యదార్థములు గావు. జ్ఞాననిమగ్నుడైన యోగీశ్వరునకు, ఆత్మజ్ఞాన ముదయించిన తోడ, ఉపాధుల భ్రాంతి తొలగిపోవును. సూర్యోదయము కాగానే, చీకటి సూర్యుని జన్మునందు లీనమగునట్లు, ఆత్మజ్ఞానము కలిగినంతనే అజ్ఞానము నశించి, అజ్ఞానమువల్ల ఉత్పత్తియైన ఉపాధులన్నీ ఆత్మయందే లీనమగును. ఆత్మ అవధులులేని అనంతుడు. నామరూపములులేని చైతన్యస్వరూపుడు. సర్వవ్యాపి. జ్ఞానోదయమైన సాధుపుంగవునకు, ఉపాధులు నశించుటతో, తన వ్యక్తిత్వ భ్రాంతిభావము పోవుట, ఆత్మయందు తాను లయించి సర్వాత్మ భావమును పొందును. దీనికి ఉపమానములుగ, నీటిలో నీరు, ఆకాశములో ఆకాశము, వెలుతురులో వెలుతురువలె, బ్రహ్మజ్ఞాని అనంత స్వరూపుడైన బ్రహ్మములో లీనమగునని చెప్పబడినది. ఈ విషయముపై ఇంకను ఎన్నో ఉపమానములు ఆధ్యాత్మిక సాహిత్యమందు చెప్పబడినవి. ఆదిశంకరులు వివేకచూడామణిలో చెప్పిన ఈ క్రింది శ్లోకము గమనించనగును:

క్షీరంక్షీరే యథాక్షిప్తం తైలంతైలే జలంజలే।
సంయుక్తమేకతాంయాతి తథాత్మన్యాత్మ విన్మునిః ॥

అనగా, పాలయందు పాలును, నూనెలో నూనెయును, నీటిలో నీరును ఎట్లు కలిసిపోయి ఏకమగునో, అట్లే ధ్యాననిమగ్నుడై ఆత్మానుభూతిని పొందిన మహనీయుడు ఆత్మయందు లీనమై ఆత్మస్వరూపు యగుచున్నాడు.

ముండకోపనిషత్తునందు చెప్పబడిన ఈ కింది శ్లోకము కూడ గమనార్హము :

యథానద్యః స్యందమానాః సము ద్రే
ఽ స్తంగచ్ఛంతి నామరూపే విహాయ।
తథా విద్వాన్ నామరూపా ద్విము క్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యం॥

అనగా, ఎలాగై ప్రవహించే నదులు వాటివాటి నామరూపములు, ఉనికి కోలుపోయి సము ద్రములో కలిసి సము ద్రముతో ఏకమగుచున్నవో, అలా ఆత్మజ్ఞాని కూడా తనకున్న పేరు, ఆకారము, ఉనికి మున్నగు వాటినుండి ముక్తిపొందినవాడై సర్వోత్కృష్టమైన జ్యోతిస్వరూపమగు పర బ్రహ్మములో లీనమై తాను బ్రహ్మస్వరూపు అగుచున్నాడు.

54

**యల్లాభాన్నా పరో లాభో**
**యత్సుఖాన్నా పరం సుఖం**
**యద్జ్ఞానాన్నా పరం జ్ఞానం**
**తద్బ్రహ్మేత్య వధారయేత్ ॥**

**తాత్పర్యము :**

దేనిని పొందిన ఇక పొందబడున దీ లేదో, ఏ ఆనందము లభించిన, ఇక కోరదగిన ఆనందమేదీ మిగిలి యుండదో, ఏ జ్ఞానము కలిగిన ఇక తెలిసికోవలసిన దీ మిగిలియుండదో అదియే బ్రహ్మత్వమును పొందిన స్థితి యని తెలిసికొననగును.

**వివరణ :**

ఉన్నది బ్రహ్మస్వరూప మొక్కటే యనెడి జ్ఞానము కలిగి అందులో స్థిరత్వము నొందిన మహనీయునకు, ఇక తెలుసుకోవలసినదేమి మిగిలియుండును? "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనెడి జ్ఞానము కలిగి, అన్నిటియందు బ్రహ్మ స్వరూపమును గాంచెడి బ్రహ్మజ్ఞానికి, తాను పొంద వలసినదేమి యుండును? సర్వమును తానై యున్నాడు. తానే సర్వము అయినాడు. సర్వమయుడైన తాను తప్ప వేరేదియు అతనికి గోచరించదు. ఏకస్వరూపుడైన బ్రహ్మమే అంతటను గోచరించుచుండు స్థితిలో ఇక తెలుసుకొనవలసిన రెండవదేదీ మిగిలి యుండదు. ఇదియే అద్వైత బ్రహ్మానుభూతి. బ్రహ్మత్వమును పొందిన స్థితి.

దేనిని చూసిన ఇక చూచుటకు మరేమియు మిగిలియుండదనగా, ఆత్మ నేత్రేంద్రియముతో చూడబడునది కాదు. విషయములే నేత్రముతో చూడబడునవి. ఆత్మ విషయాతీతము. ఆత్మనుండి ఆవిర్భవించిన నేత్రేంద్రియము ఆత్మనెట్లు చూడగలుగును? ఆత్మను చూడడ మనగా ఆత్మానుభూతిని పొందడమని అర్థము. ఆత్మానుభూతి కలిగిన తదుపరి, అందరిలోనూ అన్నిటియందు గల ఆత్మస్వరూపమునకూ తనకూ అభేదము కలుగును. సర్వము ఆత్మమయమై ఇక చూచుటకు ఆతే తరమేదీ మిగులదు. అట్లే ఆత్మస్వరూపమును పొందిన మహనీయుడు సర్వమును తానై, సర్వాత్మ స్వరూపుడగును. అట్టివాడు మరల జన్మమెత్తుట అసంభవము. ఇట్టి బ్రహ్మస్థితి నొందిన మహనీయుడు శరీరధర్మములగు జరామరణములకు, ప్రాణధర్మములగు క్షుత్పిపాసలకు, మనోధర్మములగు రాగద్వేషములకు అతీతుడై ఉండును. నిత్యానంద స్వరూపుడై ఎల్ల వేళలా ఆత్మానుభూతితో ప్రకాశించు, ఇట్టి స్థితియే బ్రహ్మత్వమును పొందిన స్థితి.

## 55

యద్దృష్ట్వా నాపరం దృశ్యం
యద్భూత్వా న పునర్భవః ।
యద్జ్ఞాత్వా నాపరం జ్ఞేయం
తద్ బ్రహ్మేత్యవధారయేత్ ॥

**తాత్పర్యము :**

దేనిని చూచిన ఇక చూచుటకు మరేదియూ మిగిలి యుండదో, ఏది అయిన ఇక అతడు చరాచర ప్రపంచములో తిరిగి జన్మమెత్తడో, దేనిని తెలిసికొనిన, ఇక తెలిసికొనుటకేదియూ మిగిలియుండదో, అ బ్రహ్మత్వమును పొందిన స్థితియని తెలిసికొననగును.

**వివరణ :**

బ్రహ్మస్వరూప స్థితిని విశదీకరించుచున్నారు. తా బ్రహ్మస్వరూపుడై విరాజిల్లుచుండు జ్ఞానికి, తనకంటె ఇతరమేదీ గోచరింపదు. బ్రహ్మేతరమేదీ స్ఫురించదు. ఎల్లప్పుడు అధిష్ఠాన బ్రహ్మము మాత్రమే స్ఫురించుచుండును. సర్వం ఖల్విదం బ్రహ్మ అను అనుభూతి పొందిన మహనీయునకు ఇక చూచుట కితరమేమియు మిగులదు. అతని దృష్టిలో అంతా బ్రహ్మమయమే. ఇక తెలిసికొనుట మీ యుండదు. అతనికి పరమాత్మ తప్ప మరొకటి లేదు.

బ్రహ్మ స్వరూపము నిరాకారము. అనగా నామ రూపములకు అతీతము. అద్వితీయము. అనగా బ్రహ్మమొక్కటియే కలదు. వే దియూ

లేదు. అనంతము. అనగా ఆద్యంతములు లేనిది. సర్వవ్యాప్తము. అనగా, అంతటా, అన్నిటిలో, లోపల బయట సర్వత్ర నిండియున్నటు వంటిది. అన్ని భ్రాంతికల్పనలకు మూలము. పరిపూర్ణము. పరమశాంతము. బ్రహ్మస్థితి నొందిన మహనీయుడు తానే ఆ అఖండ, అద్వితీయ, ఆనందమయుడైన బ్రహ్మస్వరూపుడై విరాజిల్లును. అతనికిక పునర్జన్మలేదు. తెలిసికొనుటకేదీ లేదు. సర్వమూ తా ఐనాడు.

## 56

**తిర్యగూర్ధ్వ మధః పూర్ణం**
**సచ్చిదానంద మద్వయమ్,**
**అనంతం నిత్య మేకమ్ యత్**
**తద్బ్రహ్మేత్య వధారయేత్ ॥**

**తాత్పర్యము :**

ఏది సత్‌చిదానందము, అఖండము, అద్వితీయము, అనంతము, నిత్యము మరియు సర్వాంతర్యామియై అంతటను నిండియుండునో, అదియే బ్రహ్మత్వమును పొందిన స్థితి యని తెలిసికొనుము.

**వివరణ :**

బ్రహ్మస్వరూపస్థితిని మరల విశదీకరించుచున్నారు. వెనుకటి శ్లోకపు వివరణలో బ్రహ్మత్వమును పొందిన స్థితి వివరింపబడినది. దానినే పునరుద్ఘాటించుచున్నారు. పరమార్థమగు అద్వితీయ బ్రహ్మము సత్‌చిదానందము. అనగా పరమానందమే ఆ సత్‌వస్తు జ్ఞానముయొక్క స్వరూ-

పము. దానికి నామరూపములు లేవు. అది సర్వవ్యాపకమై ఆద్యంతములు లేనిది. అఖండము. అనగా ఏకైక చైతన్యరూపము. అనంతము. అనగా అపారము. దానికంటె ఇతరమేమియు లేనిదై సర్వవ్యాపకమైనది. నిత్యము. అనగా నాశరహితమైనది. ఎల్లకాలము ప్రకృతి కతీతమై యుండునది. అంతటనూ నిండియుండి అన్నింటినీ ప్రకాశింప చేయుచు తాను మరుగున ఉండి మనోబుద్ధులకు కూడ అందనిది. ఇట్టి బ్రహ్మ స్వరూపమును పొంది దానిలో లయమైన మహాపురుషుడు బ్రహ్మ స్థితిని పొందినవాడు.

ఆదిశంకరులు వివేకచూడామణిలో బ్రహ్మస్వరూప లక్షణములను ఈ క్రింది విధముగా వర్ణించినారు:

కి మపి సతతబోధం కేవలానందరూపం
నిరుపమమతివేలం నిత్యముక్తం నిరీహం
నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ ॥

ప్రకృతి వికృతిశూన్యం భావనాతీతభావం
సమరస మసమానం మానసంబంధదూరం,
నిగమ వచనసిద్ధం నిత్యమస్మ త్ప్రసిద్ధం
హృది కలయతి విద్వాన్బ్రహ్మ పూర్ణం సమాధౌ ॥

అజర మమరమస్తా భాసవస్తు స్వరూపం
స్తిమిత సలిలరాశి ప్రఖ్యమాఖ్యా విహీనం,
శమిత గుణవికారం శాశ్వతం శాన్తమేకం
హృదికలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ ॥

మహత్తరమైన బ్రహ్మ స్వరూపము ఎట్టిదో చెప్పనలవి కానిది. దానిని మాటలచే వర్ణింపనలవి కాదు. కన్నులు చూడజాలవు. ఇంద్రియములు గ్రహించవు. ఊహాతీతమైనది. బ్రహ్మస్వరూపస్థితిలో మూగబోయి స్తబ్ధుడైయున్న ప్రశాంతచిత్తుడగు పండితుడు, తానను భవించు అఖండానందామృత స్వాదన ద్వారా బ్రహ్మత్వమును తెలుసుకొనుచున్నాడు. ఇది కేవలము స్వయంబోధ స్వరూపము. ఈ ఆనందము దేని సాటిలేనిది. నిర్వికారనిది. అవధులులేని అనంతమయము. గగనమువలె నిరాకారమైనది. అవయవరహితమైనది. కార్యకారణముల కతీతమై మనోబుద్ధుల కందని సత్‌స్వరూపము. ప్రకృతి ప్రపంచాదుల కతీతము. జాతి, కుల, గోత్రాభిమానములు లేని నిత్యానంద స్వరూపము. తూకము, కొలత ఇత్యాది పరిమితులు లేనిది. అనగా అప్రమేయము. వర్ణము, నామము, రూపము, గుణములు, జనన మరణములు లేనిది. సర్వాంతర్యామి. నిస్తరంగ సముద్రమువలె నిశ్చల గంభీర స్వభావమైనది. గుణవికారశూన్యమైనది. వాస్తవము, శాంతము శాశ్వతమునైనది.

మాయాస్వరూపములగు, శరీర ప్రపంచాదులు, మనోబుద్ధి చిత్తాహంకారములు పంచేంద్రియ ప్రవృత్తులు అన్నీ ఆత్మయందారోపింపబడిన అసత్యపు భ్రమభావములేకాని యదార్థములు గావనెడి పరమార్థ జ్ఞానము కలుగగ సాధకుడు ఇట్టి అనిర్వచనీయమైన మహదానందములో మునిగి ఆశ్చర్య నిమగ్నుడగును.

## 57

అతద్ వ్యావృత్తిరూపేణ
వేదాన్తైర్లక్ష్యతేఽద్వయమ్,
అఖణ్డానందమేకం యత్
తద్ బ్రహ్మే త్యవధారయేత్ ॥

**తాత్పర్యము :**

సమస్త విషయ వస్తువుల నిషేధానంతరము, ఏది అద్వితీయము, అఖండము, ఏకము, ఆనందమయము అయి, సర్వమునకు మూలాధారమై యుండునదని వేదాంత శాస్త్రముచే సూచింపబడినదో, ఆదియే బ్రహ్మత్వమును పొందిన స్థితియని తెలిసికొననగును.

**వివరణ :**

శరీరము, మనస్సు, ఇంద్రియములు, బాహ్య ప్రపంచము- ఇవన్నీ విషయములకు సంబంధించినవి కాగా, కర్తృత్వ భోక్తృత్వములు విషయికి సంబంధించినవి. వీటన్నిటినీ అనాత్మ పదార్థ జాతమని అంటారు. ఆత్మ వీటన్నిటి విలక్షణమై వీటికి ఆధారమైనది. పైన వివరించిన అనాత్మ విషయజాతమంతా నిషేధించి వదలివేయగా, నామ రూపరహితము, అద్వితీయము, అఖండానంద మయమునైన పరమాత్మస్వరూపము మిగిలి, అదియే మన నిజస్వరూపమై భాసిల్లును. ఇదియే బ్రహ్మత్వ రూపస్థితి. జరామరణములు, బాహ్యాంభ్యంతరములు లేనిదై ఆకాశమువలె అఖండము, పరిపూర్ణము, ఏకమునై వెలసే ప్రజ్ఞానము. సర్వమునకూ

మూలాధారమైన ఈ పరతత్వ బహ్మతత్వము, వేదాంత శాస్త్రములచే సూచింపబడి, ముముక్షువులకు సాధనాలక్ష్యమై యున్నది.

కఠోపనిషత్తునందు నచికేతునకు యముడు, అత్యంత గోప్యము, సనాతనమునైన ఈ పర బహ్మతత్త్వమును ఎంతో సుస్పష్టముగ బోధ పరచినాడు బహ్మము విశ్వమందంతటా వ్యాపించి, జీవులోనర్చు సర్వ కర్మలను వీక్షిస్తూఉంటుంది. నిత్యశుద్ధము, నిత్యసత మునైన దానిమీద పృథివ్యాధి లోకములన్నియూ ఆధారపడి ఉన్నవి.

సూర్యో యథా సర్వలోకస్య చక్షుః
న లిప్య చాక్షుషైర్ బాహ్యదోషైః
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా,
న లిప్య లోకదుఃఖేన బాహ్యః ॥ కఠోపనిషత్తు ౧౧

వెలుతురు నిచ్చు సూర్యుని సహకారము లేనిదే మానవుడు తన కనులతో ఏ వస్తువును చూడజాలడు. అందు సూర్యుని సర్వలోకమునకు చక్షువుగా భావించుచుందురు. అయినను కంటికి కలిగెడి దోషములుగాని రోగములుగాని సూర్యునికి అంటవు. అట్లే సర్వచరాచరముల యందు అంతరాత్మగ వ్యాపించియున్నను, వాటియొక్క గుణదోషములకు, శుభా శుభ కర్మలకు విలక్షణుడై, వాటితో నెట్టి సంబంధమునులేక యుండును.

ఏకో వ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి
త మాత్మస్థం యేఽను పశ్యంతి ధీరాః
షాం సుఖం శాశ్వతం తరేషామ్ ॥

కఠోపనిషత్తు ౧౨

సర్వభూతములకు అంతరాత్మయైన భగవంతు డొక్క . ఏకైక స్వరూపుడై యుండియు, ప్రకృతిని సృష్టించి వివిధ రూపములతో వెలయుచు మరల వాటన్నింటిని, తనయందు లయింప యు చుండును. అతి సూక్ష్ము డై అన్ని జీవులయందు వ్యాప్తుడైయున్న పరమేశ్వరుని. యమని యమాది యోగాంగముల నధిష్ఠించు ధ్యాన లురైన మహనీయులు తొలు దొల్త తము తాము తెలిసికొని ఆత్మసాక్షాత్కారమును బొంది, తరువాత పరమాత్మను సాక్షాత్కారము చేసికొనుచుందురు. వారికి సుఖశాంతులు ఎల్లప్పుడు నిరంతరముగా నుండును. ఇతరులకవి లభ్యము కావు.

## 5

అఖణ్డానంద రూపస
తస్యానన్ద లవా శ్రితాః ।
బ్రహ్మాదా స్తార తమే న
భవన్తా నన్దినోఖిలాః ॥

**తాత్పర్య ము :**

బ్రహ్మ, ఇం ద్రాది దేవతలు అనంతమైన బ్రహ్మానందములో ఒక అణుమా త్రము చవి చూచుచు, అందులో వారి వారి తాహతుకి తగ్గ భాగములను అనుభవించు చున్నారు.

**వివరణ :**

భగవత్తత్వం అనంతమైన బ్రహ్మానందాన్ని కలుగ స్తుంది. అ అన్నింటికి, అందరికి- అనగా మనుష్యులకు, దేవతలకు- ఉత్పత్తిస్థానం-

సకల ప్రాణులు, వ్రతలు వారివారి అర్హతల ప్రకారం బ్రహ్మస్వరూప స్థితిని చవిచూస్తారు. తమతమ సాధనలను విశిష్టతలనుబట్టి వారికి పరిపూర్ణత్వము సంభవిస్తుంది. వ్రత లనుభవించు స్వర్గసుఖములు బ్రహ్మానందములో అణుమాత్రమైనవి. అందులో వారివారి అర్హతకు, తాహతుకి తగిన భాగమును అనుభవిస్తూంటారు. ఎవరు సర్వ ఇంద్రియ సుఖాల యందు అనాసక్తులై వాటిని నిరాకరించి, నిరంతర ధ్యానానుష్టాన సంపన్నులై వ్రతర సాధన స్తూంటారో, వారికే పరిపూర్ణ బ్రహ్మానందము లభ్యమౌతుంది. అట్టివారే అమరులై ముక్తిని పొందుతారు. ఇలాంటి ముక్తవాంఛ గలవారిని • వ ముముక్షువులంటారు. ఈ విషయాన్నే శ్వేతాశ్వతరోపనిషత్తునందు గూడ చెప్పబడింది :

యచ్చ స్వభావం పచతి విశ్వయోనిః
పాచ్యాంశ్చ సర్వాన్ పరిణామయేద్ యః ।
సర్వమేతద్ విశ్వమధిష్ఠత్యేకో
గుణాంశ్చ సర్వాన్ వినియోజయేత్ యః ॥

అనగా, భగవంతు యావత్ ప్రపంచాని ఒక్కగా నొక్కడైన సృష్టికర్త. అన్నిటికి ఉత్పత్తి స్థానము ఆయన ఒక్కడే. ఆయన దివ్యత్వం నుండే యీ యావద్విశ్వము ఉత్పత్తియై పరిణామం చెందుతూ ఉంటుంది. ఎవరి తాహతును, అర్హతలనుబట్టి వారికి పరిపూర్ణత్వం లభింపచేస్తాడు. ఎవరెవరి కర్మలనుబట్టి వారివారి గుణాలను ఏర్పరుస్తాడు. ఇలాగ ఈ విశ్వమంతటినీ ఆయన పర - క్షిస్తూంటాడు.

## 59

తద్ యుక్తమఖిలంవస్తు
వ్యవహార స్తదన్వితః
తస్మాత్ సర్వగతంబ్రహ్మ
క్షీరే సర్పి ౕ వాఖిలే ॥

**తాత్పర్యము :**

అన్ని విషయ వస్తువులయందును బ్రహ్మస్వరూపము వ్యాపించియున్నది. బ్రహ్మ స్వరూపమువల్లనే సర్వ కర లు సాధ్యమగుచున్నవి. అనగా పాలలో వెన్న ఎట్లు వ్యాపించియున్నదో, అట్లే బహ్మ స్వరూపము సర్వత్రా వ్యాపించి యున్నది.

**వివరణ :**

"సర్వం ఖల్విదం బ్రహ్మ" అను మహావాక్యము ననుసరించి-బ్రహ్మస్వరూపము అన్ని విషయ వస్తువులయందు, లోపల వెలుపలకూడ, వ్యాపించియున్నదని విశదపరచుచున్నారు. బ్రహ్మములేని చోటే లేదు. "ఇందుగల డందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి జూచిన అందందే గలడు దానవాగ్రణి వింటే" అని ప్రహ్లాదుడు తన తండ్రితో చెప్పినట్లు, బ్రహ్మము సర్వత్రా వ్యాపించి యున్నది. విషయములన్నీ బ్రహ్మమువల్ల ప్రకటితము లగుచున్నవి. మనో బుద్ధ్యహంకారములు వాటివాటి ప్రవృత్తులలో భాసించుటకు బ్రహ్మమే కారణము. సర్వ కార్య కలాపములు, ఇంద్రియ వ్యాపారములు- బ్రహ్మ స్వరూపము వాటి యందు, పాలలో వెన్న కలిసియున్నట్లు, వ్యాపించి

యుండుటవల్లనే జరుగుతున్నవి. జడపదార్థ సముదాయములగు శరీర ఇంద్రియాది సమస్త విషయములకు, స్వయముగా సత్తాస్ఫూర్తులు లేవు. వాటికి సత్తాస్ఫూర్తులు బ్రహ్మము వల్లనే కలుగుచున్నవి. కేనోపనిషత్తులో చెప్పినట్లు, మనస్సును విషయములపై ప్రేరేపింపజేసేది బ్రహ్మము. చెవికి వినికిడి, కంటికి చూపు, జిహ్వకు మాటలాడు శక్తి, మనసుకు గ్రహణశక్తి, ప్రాణాలకు ప్రాణశక్తి- ఈ విధంగా సర్వ ప్రకృతి శక్తులను పరీక్షించి చూచిన, ఈ శక్తులన్నిటి వెనుకను వాటికి కారణభూతుడైన మూలపురుషుడగు బ్రహ్మమే ఉన్నాడు. ఇదియే పరమ సత్యము. ఈ సత్యమును తెలుసుకోవడమే జ్ఞానము.

శ్రోత్రస్య శ్రోత్రం మనసోమనో యద్
వాచోహ వాచం స ఉ ప్రాణస్య ప్రాణ,
చక్షుసశ్చక్షురతి ముత్యధీరాః
ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవన్తి ॥

అనగా, ఆత్మశక్తి చేత చెవులు వినగలుగుచున్నవి. కళ్ళు చూడగలుగుచున్నవి. నోరు మాట్లాడగలుగుచున్నది. మనస్సు సంకల్పించ గలుగుచున్నది. ప్రాణములు శరీరములో పని చేయగలుగుచున్నవి. జడసముదాయములైన ఇంద్రియాలకూ, మనస్సుకూ, ప్రాణాలకూ, ఆత్మ విలక్షణమని తెలుసుకున్న బుద్ధిమంతుడు, అజ్ఞానపు మాలిన్యం వదలినవాడై తన నిజస్వరూపమయిన ఆత్మను గుర్తించుకొని అమరుడౌతాడు.

దేనిని మనస్సు గ్రహించలేదో, అయి దేనిచేత మనస్సు సర్వమునూ గ్రహించుచున్నదో, దేనిని దృష్టి చూడలేదో, కాని దేనిచేత చక్షువులకు దృష్టి కలుగుచున్నదో, దేనిని చెవులు వినలేవో, అయినను దేనిచేత చెవులకు వినికిడి శక్తి కలుగుచున్నదో, దేనిని ఘ్రాణేంద్రియము నాసిక

వాసన చూడజాలదో, కాని దేనివలన దానికి వాసన చూచు ప్రవృత్తి కలిగినదో, అదియే ఆత్మస్వరూపమని నోపనిషత్తునందు ఎంతో స్పష్టంగా వివరింపబడినది.

## 6

ఆనణు మస్థూలమ హ్రస్వ
మదీర్ఘమజ యవ యమ్
అరూపగుణ వర్ణాఖ ం
తద్ బ్రహ్మేత వధారయేత్ ॥

**తాత్పర్యము :**

ఏది సూక్ష్మముగాని స్థూలముగాని కాదో, పొట్టిగాని పొడుగుకాని కాదో, పుట్టుటకాని మారుటకాని లేనిదో, ఆకారము, గుణములు, రంగులు లేనిదో, అట్టిదే బ్రహ్మత్వము ను పొందిన స్థితియని తెలిసికొననగును.

**వివరణ :**

బ్రహ్మస్వరూప లక్షణములను ఇంకా విశదంగా సలక్షణంగా తెలుపుచున్నారు. బ్రహ్మము నిర్వికారము, నిరవయవము, నామ రూప రహితము. అలాంటి బ్రహ్మస్వరూపము పొట్టిగా కాని, పొడుగా కాని ఉండుట అసంభవము. స్థూలము, సూక్ష్మము అనునవి బ్రహ్మస్వరూపము నకు వర్తించవు. స్థూల సూక్ష్మ రూపములన్నీ, అజ్ఞానజనితములై, నిత్య స్వరూపుడు, సత్యస్వరూపుడు అయిన బ్రహ్మమునుండి వెలువడి, మరల బ్రహ్మములో లయించును. నామరూపరహితుడు, చైతన్యస్వరూపుడు

నైన బ్రహ్మమునకు, పుట్టుట, మారుట అనునవి ఉత్పన్నము కావు. బ్రహ్మము నిరాకారము. కనుక ఆకారమనునది బ్రహ్మమున కుండుట సంభవింపదు. నిర్గుణస్వరూపుడగు బ్రహ్మమునకు గుణము లుండుటకు తావులేదు. ఆకారమేదీ లేని నిరాకారుడైన బ్రహ్మకు, రంగులు కలుగుటకు సాధ్యమే లేదు. జనన మరణములుగాని, గుణములుగాని లేని నిరాకార, నిర్వికార, నిర్మల, నిశ్చలుడగు బ్రహ్మస్వరూపుడు, పరిపూర్ణము, అనంతము, అఖండమునై ఆకాశమువలె నుండును.

పర బ్రహ్మతత్వమును ఈ విధంగా ప్రశ్నోపనిషత్తునందు కూడ వివరించబడినవి :

పరమే వాక్షరం ప్రతిపద్య ,
సయోహవై తదచ్ఛాయ మశరీర మలోహితం
శు భ్ర మక్షరం - దయ ,
యస్తు సోమ్య, స సర్వజ్ఞః సర్వోభవతి
తదేష శ్లోకః ॥ 4, 10

అనగా, బ్రహ్మస్వరూపమును ఏ విధమైన శరీరము కాని, ఛాయ కాని రంగుకాని లేనిదని, స్వచ్ఛమై నాశరహితమైనదని, ఎవడు తెలుసుకొనునో అతడు అట్టి అవినాశికరమైన పర బ్రహ్మ స్వరూపమును అనుభూతి పొందుతాడు. సర్వజ్ఞుడై అన్నిటియందు ఆ పర బ్రహ్మమును చూడగలుగు ప్రజ్ఞావంతుడవుతాడు.

ముండకోపనిషత్తునందు కూడ బ్రహ్మస్వరూప మీ విధముగా వివరింపబడినది :

యత్ తద ద్రశ్య మ గ్రాహ్య మగో త్ర మవర్ణ
మ చక్షుః శ్రో త్రం తదపాణిపాదమ్ ।

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్ భూతయోనిం పరిపశ్యంతిధీరాః ॥

అనగా, ఏదైతే కళ్ళకు గోచరముకానిదో, మనస్సుకు గ్రాహ్యము కానిదో, ఉత్పత్తినాశములు గాని, చేతులు, కాళ్ళు మున్నగు అవయవములు గాని, రంగులుగాని లేనటువంటిదో అటువంటి ఆత్మస్వరూపమును జగత్కారణమైన దానినిగా సాధన సంపన్నులైన ధీరులు తెలుసుకుంటారు. అట్టి బ్రహ్మస్వరూపము నిత్యమైనది, సర్వరూపాలలో నిండియున్నది, అంతటా లోపలా బయటా వ్యాపించియున్నది, అత్యంత సూక్ష్మమైనది, అవ్యయమైనదీ అయి వున్నదని గ్రహించుకుంటారు.

6

యస్యభాసా భాసతేర్కాది
ర్భాస్యైర్తు న భాసతే
యేనసర్వమిదం భాతి
తద్ బ్రహ్మేత వధారయేత్ ॥

**తాత్పర్యము :**

దేని జ్యోతివలన సూర్యచంద్రాదులవంటి ప్రకాశమానములగు మండలములు ప్రకాశించుచున్నవో, ఏది వాటి కాంతివలన ప్రకాశింపబడదో, మరియు నివల్ల సమస్తము ప్రకాశింపబడుచున్నదో, అదియే బ్రహ్మత్వమును పొందిన స్థితి యని తెలుసుకొనవలెను.

**వివరణ :**

బ్రహ్మతత్వము స్వయం ప్రకాశము. తాను ప్రకాశించుచు అన్నింటిని ప్రకాశింపజేయు పరంజ్యోతి. ఆ బ్రహ్మజన్యులైన సూర్యచంద్రాదులగు ప్రకాశమండలములన్నీ ప్రకాశింపగలుగుచున్నవి. వాటి ప్రకాశమునకు బ్రహ్మమే మూలము. బ్రహ్మమాతము నివల్లను ప్రకాశించుటలేదు.

కఠోపనిషత్తునందు నచికేతునకు యముడు విషయము ఇట్లు బోధించినాడు :

న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నేమా విద్యుతోభాంతి కుతో యమగ్నిః
తమేవ భాంత మను భాతి సర్వం
తస్య భాసా సర్వ మిదం విభాతి ॥

బ్రహ్మ ప్రకాశ మెంత అద్భుతమైనదో ఎట్లు చెప్పగలరు? ఆ బ్రహ్మ ప్రకాశముతో సూర్య, చంద్ర, నక్షత్రాదుల ప్రకాశ మెంతటిది? విద్యుత్ ప్రకాశము బ్రహ్మప్రకాశము ముందెందుకు పనికివచ్చును? ఇక అగ్ని ప్రకాశమును గూర్చి ఏమి చెప్పనగును? ఆ బ్రహ్మ ప్రకాశము వలననే సర్వమూ భాసించుచున్నవి. దాని ప్రకాశము వల్ల సూర్య చంద్ర నక్షత్రాదులకు భాస కలుగుచున్నది.

2

స్వయమన్తర్బహిర్వ్యాప్య
భాసయన్నిఖిలం జగత్,
బ్రహ్మప్రకాశతే వహ్ని
ప్రతప్తాయ సపిణ్డవత్ ॥

తాత్పర్యము :

ఎర్రగా కాలిన ఇనుప గోళములోని అగ్ని దాని లోపల బయట వ్యాపించి తాను స్వయముగా ప్రకాశించు చున్నట్లు, పర బ్రహ్మ స్వరూపము విశ్వమంతటా లోపల బయట వ్యాపించి తాను స్వయముగా ప్రకాశించుచున్నది.

వివరణ :

సర్వవ్యాపకుడు స్వయంజ్యోతిః స్వరూపుడు అగు బ్రహ్మము, విశ్వమంతటా బాహ్యాభ్యంతరములలో నిండియున్నాడు. ఆయనలేని చోటు లేదు. అంతా బ్రహ్మమయం. మనసులో కలి. అన్ని ఆలోచనలలోను, ఇంద్రియ వ్యాపారము లన్నింటియందు, బ్రహ్మము కలిసియే ఉంటున్నది. ఎర్రగా కాలిన ఇనుప గుండులోని నిప్పులాగ, ఈ అనంత విశ్వంలోని అనంతుడగు బ్రహ్మము అన్నిటిలో కలసి, తను ప్రకాశించుచు, అన్ని టినీ ప్రకాశవంతము చేయుచున్నాడు. ఎర్రగా కాలి వున్న ఇనుపగుండు స్వభావములో నిప్పు స్వభావము కలిసి ఉంటుంది. అట్లే, అంతఃకరణ చతుష్టయ మనబడు మనోబుద్ధి చిత్తాహంకారములకు ప్రేరణ నిచ్చునది వాటియందు కలియున్న బ్రహ్మమే. మనోవికారములలోను, బుద్ధి యు

ని యములలోను, సకల చిత్తవృత్తులలోను, " ను నేన"నుచు భాసిం చుచు, విజృంభించుచుండెడి అహంకార భావములోను ఆత్మ కలిసియే యుండును. సర్వేం ద్రియ వ్యాపారములకు మూలమా బ్రహ్మస్వరూపమే.

6

జగద్విలక్షణం బ్రహ్మ
బ్రహ్మణోన న్న ంచన,
బ్రహ్మన ద్భాసతే మిథా
యథామరు మ చికా ॥

**తాత్పర్యము :**

బ్రహ స్వరూపము జగత్తునకు అ తమైనది. బ్రహ్మము మినహా ఉండునదేదియునూ లెదు. బ్రహ్మము కాని వస్తువేదైనను ఉన్నట్లు గోచరించినచో, అది ఎండ మావివలె అసత మైన .

**వివరణ :**

ఉన్నది బ్రహ మొక్కటియే. రెద్దియును లేదు. సర్వవేదాంత సిద్ధాంతసారము ఇదియే. బ్రహ్మము కాని దీ ఎప్పటను లేదు. అట్టి దైనా గోచరించుచుండినచో అదంతా ఇం దియములకు భాసించు భ్రాంతిమయ మగు పకృతి కల్పనయే. ఎండమావివలె అసత్యమైన . నిజముగా . మాయవలనను, అజ్ఞాన ప్రవృత్తివల్లను ఉన్నట్లు గోచరించు చున్నది. ఉన్నది సచ్చిదానందమగు బ్రహ మొక్కటియే.

బ్రహ్మము దేనికినీ గోచరము కాక ప్రపంచమునకు విలక్షణమైనది. ఇం ద్రియములకు గాని బుద్ధికిగాని అందనిది. బ్రహ్మము ఉండుట వల్లనే, భ్రాంతికల్పితమైన అనాత్మ జాతమంతా తెలియబడుచున్నది. కాని బ్రహ్మము దేనిచేతనూ తెలియబడదు. ఎవరూ బ్రహ్మమును తెలుసుగో లేరు. ఎవరైనా తాను బ్రహ్మమును తెలుసుకున్నానని అంటే అది వట్టి అబద్ధమే అవుతుంది.

తెలియబ డంతా అబద్ధం అనీ, యదార్థంగా లేదని, ఏది తెలియబడనిదో అ ఎప్పుడూ ఉం దని. గ్రహించుకోవడమే తెలివి. ఇలా తెలుసుకు- తెలివియే ఆత్మజ్ఞానం. ఆత్మానాత్మ వివేకం. ఇది ఆత్మాను భూతికి కింద మెట్టు. ఎప్పుడై నిరంతర ధ్యానానుష్టానాలవల్ల, తెలియ బ పన్నీ అబద్ధమని తెలుసుకున్న ఆ తెలివి కూడా తెలియబడదో, అ ప . పరమమౌనావస్థ. తురీయానంద స్థితి. ఆ దివ్యానుభవమే ఆత్మాను భూతి

ఈ విషయం నోపనిషత్తులో ఎంతో సుస్పష్టంగా ఈ ంది శ్లోకంలో చెప్పబడింది :

అన్య వ తద్విదితాదథో అవిదితా దధి
ఇతి శు శుమ పూ ర్వేషాం యేనస్తద్ వా చచక్షి ॥

అన్నగా, తెలియబ వాటిని తెలుసుకుంటూన్న తెలివికంటె, అది బ్రహ్మము నిశ్చయంగా విలక్షణమైనది. ఇం- కాక, తెలియబడక అవ్యక్తంగా ఉండే దానికంటే కూడా, అది బ్రహ్మము అ తమైనది. ఈ విధంగా యీ ఉత్కృష్టమైన విషయాన్ని మా పూర్వీకులైన ఆచార్యులు మాకు తెలుపగా విన్నాము.

64

దృశ్యతే శ్రూయతే యత్తద్
బ్రహ్మణోఽన్య న్న విద్యతే,
తత్త్వ జ్ఞానాచ్చ తద్బ్రహ్మ
సచ్చిదానంద మద్వయమ్ ॥

**తాత్పర్యము :**

తెలుసుకొనుచున్నదంతయూ, వినుచున్నదంతయూ బ్రహ్మమే; మరేదియును కాదు. సత్యస్వరూప జ్ఞానము పొందిన మహాత్ముడు విశ్వమెల్లను ఆనందమయ మగు అద్వైత బ్రహ్మస్వరూపముగా చూచుచుండును.

**వివరణ :**

కేనోపనిషత్తునందు చెప్పినట్లు, బ్రహ్మము వలన మనస్సు ప్రేరింపబడుచున్నది. ప్రాణము తన పనులను చేయగలుగు చున్నది. బ్రహ్మము వలనే చెవి వినగలుగుచున్నది. కన్ను చూడగలుగు చున్నది. నోరు మాటలు పలుకగలుగుచున్నది. ఇంద్రియములు, ప్రాణములు, మనస్సూ, బుద్ధీ అన్నీ జడపదార్థములు. వాటికి వాటి వాటి యొక్క కార్య కలాపములు నిర్వర్తించుటకు శక్తిసామర్థ్యములు నిచ్చునది బ్రహ్మమే. కనుక బ్రహ్మమే సర్వ కార్య కలాపములకు మూలమై యున్నది. అన్ని కార్య కలాపములు బ్రహ్మమునవే. సర్వం బ్రహ్మమయమని వెనుకటి శ్లోకములో చెప్పి, ఈ శ్లోకములో సర్వ కార్య కలాపములు బ్రహ్మమునవే అని తెలుపుచున్నారు.

ఉన్నది బ్రహ్మమొక్కటేనని, సర్వ కార్యక్రమములు బ్రహ్మ వే నని జ్ఞానము పొందిన మహనీయుల తెలియగలరు. అట్టి మానవోత్తము లకై సర్వసృష్టి బ్రహ్మమయముగా గోచరించును. సత్చిదానంద మయ మగు బ్రహ్మము మినహా ఇతరమేదియూ ఆ బ్రహ్మభూతులకు గోచరిం పదు.

## 65

సర్వగం సచ్చిదాత్మానం
జ్ఞానచక్షుర్నిరీక్షతే,
అజ్ఞాన చక్షుర్నేక్షేత
భాస్వంతం భానుమంధవత్ ॥

**తాత్పర్యము :**

ఆత్మ సత్యస్వరూపము, చైతన్యమునై ఎల్లప్పుడు ఎల్లెడలా ప్రత్యక్షముగా భాసించుచుండినను, జ్ఞాననేత్రము -త అది తెలియబడుచున్నది. గుడ్డివాడు ప్రకాశించు చున్న సూర్యుని ఎట్లు చూడజాలడో, అట్లే అజ్ఞానము వలన మసగబారిన వాని దృష్టి దీప్యమాన ప్రకాశితమగు ఆత్మను చూడజాలదు.

**వివరణ :**

సత్యరూపమైన బ్రహ్మమొక్కటే ఎల్లెడలా ఎల్లప్పుడూ భాసించు చున్నను, సామాన్యులకది గోచరించదు. ఏలనన, బ్రహ్మము దేని తనూ తెలియబడదు. ఎవరూ బ్రహ్మమును తెలుసుగో లేరు. తెలిసికొనుటకు అది

విషయము కాదు కదా! బ్రహ్మము సర్వ విషయములకు అతీతమై వాటికి ఆధారమైనది. విషయములన్నీ ఇంద్రియగోచరములు. ఆత్మ బ్రహ్మము సర్వేంద్రియ మనోబుద్ధ్యాదులకు విలక్షణమైన శుద్ధ చైతన్యము.

ఎవరైనా తాను భగవంతుని తెలిసికొనినాననిన, అది పట్టి అబద్ధమే కాగలదు. తెలుసుకొనుటకు బ్రహ్మము విషయము గానందునను, తెలుసు కొనువాడు బ్రహ్మమున కన్యుడుగాడు కనుకను, బ్రహ్మమును తెలుసు కొనుట అనుమాట అర్థరహితము, అసత్యము అగును. మనోబుద్ధీంద్రి యాలకు ద్యోతకశక్తి కలిగించినదే బ్రహ్మము. అందువలన వాటి గ్రహణ శక్తిద్వారా బ్రహ్మము గోచరించుట అసంభవము. ఇతర విషయ వస్తు వులవలె బ్రహ్మము జ్ఞేయ విషయముకాదు. బ్రహ్మమును తెలుసుకొనుట అనునది అజ్ఞానభావమే. బ్రహ్మమును పొందుట యనగా మన సహజ స్వరూపమగు బ్రహ్మత్వమును స్ఫురణకు తెచ్చుకొనుట. మరచియున్నట్టి మన సత్యస్వరూపమైన ఆత్మను జ్ఞప్తికి తెచ్చుకొని, అ మన సహజ స్వరూపమని గుర్తించుకొని అనుభూతిని చెందుట. అట్టి బ్రహ్మానుభవ స్ఫురణము, ఆత్మానుసంధాన జ్ఞాపిక, జ్ఞాన, ధ్యాన సాధనలద్వారా కలు గును. జ్ఞానము కలిగిన వెంట తా బ్రహ్మస్వరూపుడై విలసిల్లునుగాని, తన కన్యమగు మరొకటేదీ యుండజాలదు. ఇట్టి జ్ఞాన స్వరూపుని జ్ఞాన నే తమునకే సర్వమూ బ్రహ్మముగా విరాజిల్లుచుండును. కాని ఆవరించి యున్న అజ్ఞానము వలన సామాన్య మానవుల కది అనూహ్యము. అంతటా వ్యాపించి ప్రత్యక్ష సత్యమై భాసించుచుండినదైనను, బ్రహ్మము అజ్ఞా నము వలన సామాన్య మానవాళికి అగోచరమైనది. దీనికి ఉపమానముగా, సూర్యుడు దీప్యమానముగా ప్రకాశించుచున్నను గ్రుడ్డివారు ఆ సూర్య తేజమును చూడలేరని చెప్పినారు.

## 66

శ్రవణాదిభిరుద్దీప్తో
జ్ఞానాగ్ని పరితాపితః,
జీవఃసర్వ మలాన్ముక్తః
సువర్ణవత్ ద్యోతతే స్వయమ్ ॥

**తాత్పర్యము :**

అపవి తముల నుండి విముక్తుడైన జీవుడు, వణ మనన నిధిధ్యాసాదులతో రగుల్కొని నటువంటి జ్ఞానాగ్ని వలన బాగా పదీప్తుడైనవాడై, బంగారమువలె స్వయముగా పకాశించును.

**వివరణ :**

అప తము లనగా ఆధ్యాత్మిక పరిభాషలో ఇం దియ పేరితము లగు కార్యకలాపములు, విషయ పవృత్తులు, ని గహములేని మనోవికారములు, శ మే ను అనుకొనెడి హ భాంతి. ఈ అపవి తముల నుండి సాధకుడు ముందు విముక్తుడు కావలెను. ఇట్టి విముక్తి శమదమాదుల వలనను, వివేక వైరాగ్య ముల వల్లను కలుగును. తరువాత సాధనాంశములు వణ, మనన, నిధి ధ్యాసలు. ఈ సాధనలెంత వతరముగను చిత్తశుద్ధితోను - పిన అంత క్రమముగా జ్ఞానాగ్ని రగుల్కొని తన నిజ స్వరూపమగు ఆత యం దనుభూతుడగును.

ఆత స్వరూపము స్వయం పకాశమై, సర్వమునూ పకాశింప జేయుచుండును. అట్టి పకాశాత్మకుడు బంగారమువలె మెరియుచు పకా

శించుచుండునని చమత్కారముగా తెలియ యుచున్నారు. అనగా ప్రపంచ ములో బంగారమెంత విలువైనదో, ఎంత స్వల్పముగా లభ్యమగుచున్నదో, అట్లే ఆత్మానుభూతి నొందినవారు అరుదుగా నుందురు. బంగారము వలె ఎంతో విలువైనవారు. బంగారమువలె స్వయం ప్రకాశవంతులు.

మనుష్యాణాం సహ స్రేషు కశ్చిద్యతతి సిద్ధ
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్త్వతః ॥

వేలకొలది మానవులలో ఒకానొకడు పూర్వజన్మ సుకృత పరి పాకము వలన సత్యాన్వేషణ యందుకు మోక్షాసక్తుడై ప్రయత్నించు చున్నాడు. అట్టి ప్రయత్నము - యు ముముక్షులలో ఒకానొకడు నన్ను భగవానుని తెలుసుకొనుచున్నాడు. అనగా బ్రహ్మస్వరూపమే తన నిజ స్వరూపమను జ్ఞానము కలవాడగుచున్నాడని శ్రీకృష్ణుని- అర్జునునకు భగవద్గీతలో చెప్పబడినది.

## 67

**హృదాకాశోదితోహ్యాత్మా**
**బోధ భానుస్తమోపహృత్,**
**సర్వవ్యాపీ సర్వధారీ**
**భాతిసర్వం ప్రకాశతే ॥**

**తాత్పర్యము :**

జ్ఞానభాస్కరుడైన ఆత్మ హృదయాకాశమందు ఉద యించి చీకటిని 'అజ్ఞానమును' నశింప యును. సర్వాంత

ర్యామియై సర్వాధారమైనదై తాను పకాశించుచు సర్వ
మును పకాశింప యును.

**వివరణ :**

జిజ్ఞాసులలో నాటుట కొరకు ఆత్మతత్త్వమును గురించి చెప్పినదే మరల మరల చెప్పుచున్నారు. ఎన్నిసార్లు ఎన్ని విధముల వర్ణించినను, ఆత్మను గూర్చి వినుటకుగాని, చెప్పుటకుగాని, వాయుటకుగాని, చదువుటకు గాని జిజ్ఞాసులకు విసుగురాదు. ఆత స్వరూపము అమృతత్వము. దానిని గూర్చి ఎంతో కుతూహలముతో సాధన·యు జిజ్ఞాసులు, ఆత ను భూతికి ఎంతో తహతహ లాడుచు సాధన చేయుదురు. అట్టివారికే ఈ ఆత బోధ సుబోధకమై రాణించును.

శరీరమందు ఆత్మస్థానము హృదయ కుహరము. హృదయమే ఆత్మ. అయి రక్త పసారణము సే రక్తమాంస పిండమైన దేహావయవం హృదయమని భావించుట పొరపాటు. అది వట్టి జడ పదార్థం. 'గుండెకాయ'. హృదయ మనగా ఆత్మానుభూతి కలుగు స్థానము. అది ఆనందనిలయమై, సంకల్ప వికల్ప శూన్యమై, ఆత్మ ానమునకు లక్ష్యమైన స్థానము. అచటినుండి జ్ఞానభాస్కరుడైన ఆత్మ ఉదయించినంతనే, అనగా ఆత్మానుభూతి కలిగిన తక్షణమే, అజ్ఞానపు చీకటి జాడలన్నీ తొలగిపోవును.

ఆత్మ సర్వాంతరా మి. అన్నింటిలోను లోపలను బైటను అంతటా వా పించియున్నది. అన్నింటికి ఆత ఆ యమై ఆధారమై యున్నది. ఆత్మ స్వయం పకాశము. తాను పకాశించుచు అన్నింటిని పకాశవంతములుగా జేయును.

6

దిగ్దేశకాలా ద్యనపేక్ష్య సర్వగం
తాదిహ్న్నిత సుఖం నిరఞ్జనమ్
యఃస్వాత్మతీర్థం భజ విని ష్క్రియః
స సర్వవిస్సర్వగతో౽మృతో వేత్ ॥

**తాత్పర్య ము :**

ఎవడు సర్వకర్మలను త్యజించినవాడై, శకాల దూరములకు సంబంధించనిది, సర్వ తా పత్యక్షమై యుండునది, సీతోష్ణాదులవంటి ద్వంద్వములను నశింప జేయునది, శాశ్వతానందమును కలుగ యునది అయిన నిర ల పవి త ఆత్మస్వరూపమందు నిమగ్నుడై పార్థించునో, అతడు సర్వసాక్షి సర్వవ్యాపియై అమరత్వమును పొందిన వాడగును.

**వివరణ :**

బహ్మానుభూతిని పొందిన మహనీయుని గురించి పస్తావించుచున్నారు. బహ్మాను సంధానపరుడగు మహాత్ముడు, సర్వకర్మలను విసర్జించిన వాడగును. తనకు నిజముగా క ర్తృత్వ భో క్తృత్వములు లేవని, తానీ మిథ్యాస్వరూపములగు శరీర, ఇం ్రియ, పపంచాదుల క ంతూడ వని ఎరిగిన జ్ఞాని, కర ములెట్లాచరించును? ఆ మహాత్మునకు అంతా బ్రహ్మ త్వముగా భాసించుచుండును.

ఆ బ్రహ్మము దేశ, కాల, దూరములకు సంబంధించనిది. దేశము, కాలము, దూరము మొదలైనవి పంచేంద్రియ ప్రకృతికి సంబంధించినవి. అవన్నీ అజ్ఞానదశలో వాటివాటి స్వభావములతో గోచరించుచుండును. జ్ఞాన ముదయించిన తోడ అవన్నియూ భ్రాంతులేయని తెలియుటతో, యదార్థమైన స్వస్వరూప బ్రహ్మవస్థయే మిగులును. అట్టి బ్రహ్మవస్థ కలుగుట యనగా, సర్వత్రా ఎల్లప్పుడూ, ప్రత్యక్షమై విలసిల్లుచున్న బ్రహ్మమే తానని ఎరుకగలిగి అందు స్థిరుడై యుండుట.



సర్వకాల సర్వావస్థలయందు అంతటా ప్రత్యక్షముగా ప్రకాశించుచు, నిశ్చలము, నిర్మలము, ఆనంద నిలయము ద్వంద్వముల కతీతము నైన పవిత్రాత్మ స్వరూపమునందు సర్వదా నిష్ఠకలిగి ధ్యాన నిమగ్నుడైన మహనీయుడు, సర్వవ్యాపి సర్వసాక్షి అయిన బ్రహ్మస్వరూపములో లయము పొంది, బ్రహ్మ స్వరూపు అయి అమరుడగును.



సమాప్తం